# చతుర్వేదసారము

శ్రీ పాలకురికి సోమనాథమహాకవిప్రణీతము



విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్, శైవసాహితీ
సార్వభౌమ, ధర్మభూషణ, శివశరణ,

శ్రీ బండారు తమ్మయ్యగారిచేఁ
బరిష్కృతము.



ప్రకాశకులు:

**చలవాది రాచయ్య,**
ఉపాధ్యాయులు, వల్లూరుపాలెము,
విజయవాడ తాలూకా, కృష్ణాజిల్లా.

# పీఠిక

ప్రసిద్ధవీరశైవకవి యగు పాల్కురికి సోమనాథుఁడు రచించిన పద్యకృతులలోఁ జతుర్వేదసారము చాల ప్రఖ్యాతమైనది. సోమనాథుఁడే పండితారాధ్యచరిత్రావతారికలో నీకృతి రచియించినట్లు తన్ను భక్తులు ప్రశంసించినట్లు చెప్పినాఁడు.

"వరవీరభక్తి సద్వైదికంబుగను
విరచించితివి చతుర్వేదసారమున"

ఈ గ్రంథమున శివపారమ్యము, వీరశైవతత్త్వము, శ్రుతిస్మృతి పురాణేతిహాసములనుండి ప్రమాణములతో సమర్థింపఁబడినవి. సోమనాథుఁడు సోమనాథభాష్యములో నిట్టి విషయములను సంస్కృతభాషలో వివరించియున్నాఁడు. అట్టివి మఱికొన్ని యిందుఁ దెలుఁగులో సీసపద్యములలోఁ జెప్పఁబడినవి. ఈ సీసపద్యము లన్నియుఁ దేటగీతులతో నాటవెలఁదులతో, బసవలింగ! అను మకుటముగల యెత్తుగీతులతో నెలయుచున్నవి.

ఇందులో మొదట బసవశబ్దవ్యుత్పత్తి (వృషభ, పశుపశబ్దములనుండి పుట్టినదని) నిరూపితమైనది. తరువాత బసవనామోచ్చారణమహిమ, శివాధిక్యము; విభూతిరుద్రాక్షలింగధారణమాహాత్మ్యము, ప్రకృతిపురుష నామములు, విష్ణుభక్తులు శివభక్తు లగుటకుఁ గారణము, చరలింగస్తుతి, శీలలక్షణము, శివానుభవము మున్నగు వీరశైవమతవిషయములు విపులముగాఁ దెలుపఁబడినవి.

ఈ గ్రంథమువలన సోమనాథుని వేదవేదాంగపరిజ్ఞాన మెంతయేని ప్రస్ఫుట మగుచున్నది. మఱియు నన్నయభట్టు భారతములో

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు

నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని యును గొనియాడుచుండ

ఆ. వె. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు. (ఆది 1-31)

చెప్పినట్లుగా సోమనాథుఁ డీకృతిలో నిట్లు చెప్పియున్నాఁడు.

సీ. వైదికు లిది శుద్ధవైదికం బని యెన్న
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్ర మనఁగఁ
దార్కికు లిది మహాతర్కం బనంగఁ బౌ
రాణికు లిదియె పురాణ మనఁగ
నాగమవిదులు దివ్యాగమం బిది యనఁ
దంత్రజ్ఞులు లిది వీరతంత్ర మనఁగఁ
భక్తవారం బిది భక్తిమార్గం బన
ముక్త్యర్థు లిది మహాముక్తిద మన

ఆ. వె. కవులు భువిని నిదియె కావ్యం బనంగ స
జ్జనులకెల్ల మిగుల సంతసముగ
నిర్వికల్పరతిఁ జతుర్వేదసార మన్
పద్యముల్ రచింతు బసవలింగ ! (22 పద్యము)

పండితారాధ్యచరిత్రరచనమునాఁటికి సోమనాథుఁడు చతు
పారగుఁడు. కావుననే యీగ్రంథము రచించు నధికారము గలి,

సోమనాథునికి ముందు వెలసిన ప్రసిద్ధశైవాచార్యుఁడు హరదత్తాచార్యుఁడు రచించిన చతుర్వేదతాత్పర్యదీపిక దీనికి మార్గదర్శకము కానోపును.

ఇందులోని సీసము లన్నియు సమతావిలసితము లయి సోమనాథుని కవితా వైశద్యమును బ్రకటించుచుండును. భక్తాగ్రేసరుఁ డగు బమ్మెర పోతరాజు "మందారమకరంద" అను పద్యమునకు నిందులోని పద్యమే మూలము. ఆ రెండింటి నీదిగువ నిచ్చుచున్నాఁడను.

చతుర్వేదసారము—

సీ. రాకామలజ్యోత్స్నఁ ద్రావ నిచ్చలు గన్న
నాచకోరంబుల కరుచి యగునె
సహకారపల్లవచయములు దొరకిన
జాతికోయిలలకుఁ జప్ప నగునె
క్షీరాబ్ధిలోపలఁ గ్రీడింపఁగల్గిన
భువి రాజహంసకుఁ బుల్ల నగునె
విరిదమ్మివాసనవెల్లి ముంచినఁ గ్రోలు
షట్పదముల కనాస్వాద్య మగునె

ఆ. వె. బహుళతరదయార్ద్రిభావప్రభావన
మహిమఁ దనరు జంగమంబు రాఁగ
నతులభక్తిపరుల కాహ్లాదకర మగుఁ
బరిహృతాభిషంగ బసవలింగ! (155 పద్యము)

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాది యై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ

బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు
గీ. నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరులం జేరనేర్చు
వినుతగుణశీల ! మాటలు వేయు నేల.

(భాగవతము సప్తమ స్కంధము.)

సోమనాథుండు దీనిని ప్రబంధ మని పేర్కొనినాండు.

సీ. ఈకృతి రచియించి యాలోకమందుం బ్ర
తిష్ఠింతు నీశ్వరాధిక్యమహిమ
నీకృతిం బాలించి యీలోకమందు సం
పాదింతు జంగమపాత్రమహిమ
నీకృతి యొనరించి యాలోకమందు ని
ష్ఠింతుం బ్రసాదసంసేవమహిమ
నీకృతిం గావించి యీలోకమునం బ్రతి
పాదింతుం బటుతరభక్తిమహిమ
గీ. ఆది వృషభాంశజుండు బసవాధినాథుం
డిట్టికృతినాథుకృపచేత నిష్టు డంధ్ర
భాషం బ్రకటింతుం బద్యప్రబంధముగను
వసుధ సత్కవిసమ్మతి బసవలింగ !

పలువురుకవులు ప్రబంధశబ్దమును కూర్పు, రచనము అనునర్థమున వాడియుండుటచేం బూర్వోక్తమయిన సోమనాథుని యుదాహరణములో విశేష మేమియు లేదు. ఇంతకన్నం బద్యము లన్నియు "బసవలింగ" అనెడి యేకమకుటముతోం గూర్పంబడుటచే దీనిని శతకగణములో గణించుటయే సమంజసముగం గాన్పించును.

సోమనాథుఁ డీగ్రంథమువలన నీశ్వరాధిక్య, జంగమ, ప్రసాద, భక్తిమహిమలను వ్యాప్త మొనరించినాఁడు. కావుననే యాతని కంకితముగా "అన్యవాదకోలాహలము" అను శతకమును రచించిన యాతని శిష్యప్రశిష్యుఁ డా కృతిలో—

"మీరు చతుర్వేదసారంబు చేసిన
మహితపాండిత్యసమ్మతి నుతించి"

అని యాగ్రంథమును బ్రత్యేకముగఁ బ్రశంసించినాఁడు.

## ఛందోవిశేషములు

సోమనాథునికవితలోఁ గానఁగు ఛందోవిశేషములు కొన్నిటికి చతుర్వేదసారముకూడ నాదర్శముగానున్నది. వ్యస్తపదగతరేఫసంయుక్తాక్షరమునకుఁ బూర్వమందుండు వర్ణమును గురువుగనే గాక తేల్చిపలికి లఘువుగాఁగూడఁ జేసికొనుట పూర్వలాక్షణికసమ్మత మనుట పలువురకుఁ దెలిసినవిషయమే. ఈవిధిని సోమనాథుఁడు కొన్నియెడలఁ బ్రత్యేకశబ్దమధ్యస్థరేఫసంయుక్తాక్షరపూర్వవర్ణవిషయమునఁ గూడఁ బాటించుట యొకవిశేషము. అట్టి విందలిపద్యములలో నెడనెడఁ గానఁగును. మచ్చునకు 134 పద్యమున "రుద్రపశుపతి బ్రహ్మరూపుఁ గొనఁడె" అను ప్రయోగము చూడుఁడు.

రేఫసంయుక్తాక్షరపూర్వవర్ణవిషయమునఁ బాటింపఁబడు నీ పాక్షికవిధిని గొందఱు కవులు అంతస్థములు (Semi-vowels) లోని యితరవర్ణములయిన య, ల, వ, లతో సంయుక్తములయిన యక్షరముల ముందుండు వర్ణవిషయమునఁగూడఁ బాటించియున్నారు. సోమనాథునికిఁ గూడ నిది సమ్మతమే యని తోఁచును. "శ్రీ రుద్ర జాబాల శ్వేతాశ్వతరబృహదారణ్య" అను 9వ పద్యమున వకారసంయుక్తమయిన 'శ్వే' యనునక్షరమునకుఁ బూర్వమున్న జాబాలశబ్దమందలి లకారమును దేల్చి పలికి లఘువుగాఁ జేసికొననిచో గణభంగ మగునుగదా!

అఖండయతి, రేఫద్వయ యతి ప్రాస మైత్రి సోమనాథునకు సమ్మత మనుటకు దృష్టాంతములు క్వాచిత్కముగ నీగ్రంథమునను జూపవచ్చును.

ఆంధ్రమున వీరశైవవాఙ్మయమునకు సంబంధించిన యీ మహాకృతిని శైవగ్రంథములు పెక్కు సంపాదించి ప్రకటించిన మా మిత్రులు కీర్తిశేషులు శ్రీ గంగపట్టణపు సుబ్రహ్మణ్యకవిగారు తొలుదొలుత 1914 సంవత్సరమున బందరులోని భైరవముద్రాక్షరశాలలో ముద్రించి ప్రకటించినారు. ఆముద్రణము బాగుగాఁ బరిష్కృతము గానందున నందుఁ బెక్కుదోషములు దొరలినవి. దీనికిఁ దాళపత్రప్రతులు ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునఁగూడఁ దక్కువగానున్నవి. ఇందు శ్రుతిస్మృత్యాది ప్రమాణముల నుదాహరించుటలో సోమనాథుఁడు వానిని బూర్తిగా నొసంగక కుదించి యలఁతియలఁతితునుకలుగాఁ జేర్కొనుటచే వాని సుష్ఠుస్వరూపమును లేఖకులు సరిగా గ్రహింపఁజాలకుండుటచే వ్రాఁత ప్రతులలో లేఖకదోషము లెక్కువగా దొరలినవి. మఱియు "శివానుభవ సూత్రవివరము" అనుశీర్షికతో 202–297 వఱకు నున్న పద్యములు చాల వఱకు శివానుభవజ్ఞానము లేనివారికి దురవగాహము లవుటచే నందులోఁ గూడఁ బలుతావులఁ గవిపాఠములు మఱుఁగువడి లేఖకులవ్రాఁతలలో నపపాఠములు దొరలినట్లు కాననగును. ఇట్టిచిక్కులతోడను దోషములతోడను గూడిన వ్రాఁతప్రతులఁబట్టి యీగ్రంథమును లెస్సగాఁ బరిష్కరించి ముద్రించుట దుస్తరమని చెప్పనక్కఱలేదు. అయినను సాధ్యమయినంతవఱకుఁ బండితపరిష్కరణము గావింపించి గ్రంథపునర్ముద్రణము నిర్వహింపఁ గీర్తిశేషులు మా మిత్రులు భాషోద్ధారక వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు సంకల్పించిరి. సోమనాథుని యనుభవసారమును గూడఁ బరిష్కరింపించి వారింతకుమున్న నాతోడ్పాటుతోఁ బ్రకటించిరి. కాని యీగ్రంథముద్రణమును గావింపకముందే వా రస్తమించుట జరగినది.

అందుచేతఁ గృష్ణాజిల్లా విజయవాడతాలూకా వల్లూరిపాలెము వాస్తవ్యులు, భక్తవరులు, వీరశైవులు శ్రీ చలవాది రాచయ్యగారు విశేషముగఁ బరిశ్రమించి చేకూర్చిన విరామములతో నీగ్రంథమును నేనే యిప్పుడిట్లు చేతనైనంతవఱకుఁ బరిష్కరించి ప్రకటించితిని. అనుభవ సారమునకు దీనికిఁగూడఁ బరిశుద్ధమయిన వ్రాఁతప్రతు లెవరియొద్దనైన నున్నచో దయతో వానిని బంపినయెడల వానినిగూడఁ బరిశోధించి భావిముద్రణమున నింతకంటెఁ బరిశుద్ధముగ వెలువరింపనగునని మనవి చేయుచున్నాను. పూర్వముద్రణములోఁ బలుతావుల ఛందోభంగములు కూడఁ గాననగును. "ఛందోభంగం నకారయేత్" యని శాస్త్రకారుల శాసనము. కావునఁ గవిహృదయము, పద్యార్థము సరిగా గ్రహింపరాని తావుల నర్థముమాట యెట్లున్నను ఛందోభంగ మయినను గలుగకుండు నట్లు నేను స్వతంత్రముగఁ గొన్ని సంస్కరణములు గావింపవలసివచ్చినది. గ్రంథవిస్తరభీతిచే వాని నిట వివరింపనైతిని. ఈ గ్రంథముద్రణమునకు సహాకరించిన మహనీయులకుఁ బ్రోత్సాహకులు శ్రీ చలవాది రాచయ్య, రాచంశెట్టి బసవనాగయ్యగారలకుఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యాభ్యుద యములఁ బ్రసాదించుఁ గావుత మని ప్రార్థించుచున్నాఁడను. సోమ నాథుని లఘుకృతులనన్నిటిని గలిపి యొకసంపుటముగాఁ బ్రకటించుటకుఁ గూడ శ్రీ రాచయ్యగా రుద్యమించినారు. భక్తులు భాషాభిమానులు వారికి సర్వవిధములఁ దోడ్పడెదరుగాక !

ఈ గ్రంథపరిష్కరణమున నాతోపాటు శ్రమించియు, ప్రూఫులఁ జూచుటలో నతిశ్రద్ధ వహించియు మిత్రులు, శ్రీపతిముద్రణాలయాధి కారులు, విద్యావినయసంపన్నులు, శ్రీ తోకల బుచ్చిరాజుగారు నాకు మిక్కిలి తోడ్పడిన సౌజన్యమునకు నాకృతజ్ఞతాభివందనముల నర్పించు చున్నాను. పరమేశ్వరుఁడు వారి కన్నివిధముల శుభంకరుఁ డగుఁగావుత మని యభిలషింతును.

ఇట్లు,

కాకినాడ,
28–1–62

భక్తజనవిధేయుఁడు,
బండారు తమ్మయ్య

# ప్రకాశకుని విజ్ఞప్తి

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్, ధర్మభూషణ, ఇత్యాది బిరుదాంకితు లగు శ్రీ పండిత బండారు తమ్మయ్యగారు నిస్స్వార్థముగఁ జిరకాలమునుండి సాగించుచున్న శైవవాఙ్మయసేవను గుర్తించని యాంధ్రు లుండరు. వారి విమర్శవ్యాసములు పలుపత్రికలలోఁ జిరకాలముగఁ బ్రకటితము లయినవి. ప్రఖ్యాతాంధ్రవీరశైవకవిసార్వభౌముఁడు పాలకురికి సోమనాథుని ద్విపద బసవపురాణమును, అనుభవసారమును, శ్రీనాథుని భీమేశ్వరపురాణమును భాషోద్ధారక వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారు తమ్మయ్యగారిచేతనే పరిష్కరింపించి వారి పీఠికలతోఁ బ్రకటించియుండుట పలువు రెఱింగియేయుందురు. సోమనాథుని లఘుకృతులు పంచప్రకారగద్య మొదలగువాని నెన్నింటినో శ్రీ తమ్మయ్యగారే ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలు, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంచికలు మున్నగువానిలోఁ బ్రకటించియున్నారు. సోమనాథుని లఘుకృతులనన్నిటి నొక ప్రత్యేకసంపుటముగఁ బ్రకటించు నావశ్యకతను గుర్తించి నేను శ్రీ తమ్మయ్యగారి నిందుఁగూర్చి యర్థింపఁగా నీకార్యము నింతకుమున్నే యాంధ్రసాహిత్యపరిషత్పక్షమున నిర్వహింపఁ దాము సంకల్పించితి మనియుఁ గాని యింతవఱకది జరుగలేదనియు నిట్టిప్రత్యేక సంపుటమును వెలువరించుట యావశ్యకమే యనియు వారును నన్ను హెచ్చరించిరి. కాని సోమనాథుని కృతులలోఁ బేరెన్నికఁగన్న చతుర్వేదసార మొకసారి యిదివఱలో 1914 సంవత్సరమున నేదోవిధముగ ముద్రిత మగుటయేగాని యింతవఱకు మరలఁ బరిష్కృతమయి, ప్రకటితము కాలేదనియు, లఘుకృతులసంపుటమునకు ముందుగా నీచతుర్వేదసారమును బ్రకటించుట మంచిదనియు సూచించిరి. అందుపయి నేను

నామిత్రులు కొందఱితో సంప్రతించి వారి నీసత్కార్యనిర్వహణమున కయి ప్రోత్సహింపఁగాఁ బరమేశ్వరప్రేరణమున భూరివిరాళములతో వా రిందుకుఁ దోడ్పడిరి. ఆమహనీయుల నామము లిందుఁ బ్రకటితము లయినవి. వారి సాహాయ్యమూలముననే యీగ్రంథ మిట్లు ప్రకాశ మొందఁగల్గినదని మనవిచేయుచున్నాను. భక్తావనతత్పరుండగు పరమేశ్వరుండు నిరంతర మీ పుణ్యపురుషుల కవిరళాయురారోగ్యైశ్వర్యాభ్యుదయములఁ బ్రసాదించుఁగావుత మని ప్రార్థించుచున్నాను. ఈసందర్భమున నాతోపాటు కృషియొనర్చిన శ్రీ రాచంశెట్టి బసవనాగయ్యగారికి నా కృతజ్ఞతాభివందనములు. ఆరోగ్యము లేక దెబ్బదవపడిలోఁ గృశించు చున్నను సహజభాషాభిమాన మతాభిమానములను సోమనాథునియెడఁ గల సమధికభక్తిని బురస్కరించికొని విశేషశ్రమతో నీ గ్రంథమును బరిష్కరించి ప్రకటించిన శ్రీ తమ్మయ్యగారికి దీర్ఘాయురారోగ్యముల ననుగ్రహించి యుమామహేశ్వరులు సోమనాథుని లఘుకృతులసంపుటము గూడఁ ద్వరలో వారి పరిష్కరణముననే ప్రకటితమగు భాగ్యమును ఘటించుఁగాత మని ప్రార్థించుచున్నాను.

వల్లూరుపాలెము<br>1-2-1962

ఇట్లు, భక్తవిధేయుఁడు,<br>చలవాది రాచయ్య.

ఈ గ్రంథముద్రణమునకు సహాయులయిన మహనీయులు.

## ప్రోత్సాహకులు



1. శ్రీ చలవాది రాచయ్యగారి కుమారులు రాచయ్యగారు, ఉపాధ్యాయులు, వల్లూరిపాలెము, విజయవాడ తా॥ — వీరశైవులు — విరాళములు — రు. 25-0-0

2. శ్రీ రాచంశెట్టి బసవనాగయ్యగారు, వల్లూరిపాలెము, విజయవాడ తా॥ — వీరశైవులు

## ప్రధాన దాతలు

| | | | |
|---|---|---|---|
| 1. శ్రీ చలవాది కోటివీరనాగయ్యగారు | వీరశైవులు | వల్లూరిపాలెము | 100-0-0 |
| 2. కృష్ణాజిల్లాబోర్డు సభ్యులు, ఆంధ్రవిశ్వవిద్యాలయము సెనేటరు, కీ॥ శే॥ శ్రీ కొడాలి అచ్యుతరామయ్య బి. ఏ. గారి జ్ఞాపకార్థము, పుణ్యమునకుఁగాను వారి సోదరులు శ్రీ కొడాలి కోటయ్యగారు | కమ్మవారు | ,, | 116-0-0 |
| 3. శ్రీ కాసరనేని పున్నయ్యగారు | ,, | ,, | 100-0-0 |
| 4. శ్రీ చెన్నుపాటి శ్రీరాములుగారి పేరిట వారికుమారులు శ్రీ బసవేశ్వరరావుగారు | | | 50-0-0 |
| 5. శ్రీ పెద్ది కోటయ్యగారు | ,, | ,, | 50-0-0 |

| | | | |
|---|---|---|---|
| 6. శ్రీ పాశం శివరామయ్యగారు | వల్లూరిపాలెము | కమ్మవారు | 50-0-0 |
| 7. శ్రీ కాట్రగడ్డ నారాయణ రావుగారు | ,, | ,, | 25-0-0 |
| 8. శ్రీ ధనేకుల శివరామయ్యగారు | పిల్లలమర్రి సూర్యాపేట తా॥ నల్లగొండజిల్లా | ,, | 50-0-0 |
| 10. శ్రీ మడుపల్లె బసవేశ్వర రావుగారు | వల్లూరిపాలెము | వైశ్యులు | 50-0-0 |
| 11. కీ॥ శే॥ శ్రీ కుంకులగుంట కోటయ్య గారి కుమారులు సంగయ్యగారి జ్ఞాపకార్థము, పుణ్యమునకుఁగాను కుమారులు నలుగురు కలిసి | దేవరపల్లి విజయవాడ తాలూక | వీరశైవులు | 50-0-0 |
| 12. శ్రీ కుంకులగుంట వీరభద్రయ్యగారు | కాజ దివితాలూక | | 25-0-0 |
| *9. శ్రీ అన్నే శివలింగముగారు | వల్లూరుపాలెము | కమ్మవారు | 50-0-0 |

# కఠినపదములకు అర్థములు

| పద్యము | పదార్థములు |
|---|---|
| 1 | అపాంగము=కడకంటిచూడ్కి; నిర్యత్=వెడలు; ఘృణా=కృప. |
| 14 | ధ్వాంతము=చీకటి. |
| 16 | పంచాస్యంబు=సింహము; పరశువు=గొడ్డలి, లవిత్రంబు=కొడవలి, భేకి=ఆడుకప్ప. |
| 105 | నాచికొను=హరించు. |
| 150 | జంగమలింగము=చరించుశివుఁడు=శివభక్తుఁడు. |
| 151 | చెలఁడి=సాలెపురుగు; ప్రోక=రాశి. |
| 152 | జీవగఱ్ఱ=జీవనౌషధము, తంబుర, వీణ మున్నగువాని దండములో శ్రుతి హెచ్చించుటకుఁ దగ్గించుటకు నమర్చు పిడి. |
| 153 | పడ్డలు=గోవులు. |
| 158 | బద్దులు=అసత్యములు. |
| 173 | తెగినతప్పున=హానికలిగించిన దోషమున. |
| 182 | పూన్తు=పూజింతును. |
| 192 | అలుఁగువార=ప్రవహింప. |
| 194 | ప్రాఁతవాఁడ=భృత్యుఁడ; అడిగఱ్ఱ=పాదసేవకుఁడు. |
| 207 | అంగవింప=అతిక్రమింప. |
| 209 | ఉపాదానము=కారణము. |
| 213 | కృకర, దేవదత్త, ధనంజయములు=ఉపవాయుభేదములు. |
| 214 | లాల=చొంగ; అస్రము=రక్తము; మజ్జ=ఎముకలందలి చమురు. |
| 220 | లతాంతములు=పుష్పములు |
| 223 | భిస్సట=మాడిసయన్నము; చికురము=వెంట్రుక |
| 256 | సిక్థము=మెతుకు. |
| 259 | మొదవు=గోవు. |
| 299 | వైనతేయుండు=గరుత్మంతుఁడు, గద్ద. |
| 301 | పాంసువు=ధూళి. |



కీర్తిశేషులు

శ్రీ కొడాలి అచ్యుతరామయ్యగారు, బి. ఏ.



ద్రవ్యదాత

శ్రీ చెన్నుపాటి శ్రీరాములుగారు.



ద్రవ్యదాత

శ్రీ చలవాది కోటివీరనాగయ్యగారు.



పరిష్కర్త:

శివశ్రీ బండారు తమ్మయ్యగారు.

ఓం

శ్రీమ దుమామహేశ్వరాభ్యాం నమః



# చతుర్వేదసారము

## సీసపద్యములు



గురవే నమస్తే గురవే నమ
స్తే గురుమూర్తి ప్రథితగుణాయ !
శ్రీ శంభవే నమస్తే శంభవే నమ
స్తే శంభు సంచారచేతనాయ !
శ్రీ ప్రమథాయ తే శ్రీ ప్రమథాయ తే
ప్రమథావతార తారస్మరాయ !
శ్రీ వృషభాయ తే శ్రీ వృషభాయ తే
వృషభాంశ వీరమాహేశ్వరాయ !

యని నుతించి భవ దపాంగనిర్యద్ఘృణా
మృతరసాబ్ధిఁ దేల మతిఁ దలంచి
నిర్వికల్పరతిఁ జతుర్వేదసార మన్
పద్యము ల్రచింతు బసవలింగ ! 1

సారంబు గాఁగ "నమో రుద్ర మన్యవే"
యనుచు ఋగ్వేద మత్యర్థి మ్రొక్క
శ్రీకరంబుగ "నమస్తే రుద్ర మన్యవే"
యని యజుర్వేద మత్యర్థి మ్రొక్క
సారంబు "రుద్రాయ తే రస తే నమో"
యని సామవేద మత్యర్థి మ్రొక్క
ముదము దలిర్ప "నమోఽస్తు రుద్రాయ తే"
యని యథర్వణవేద మర్థి మ్రొక్క
శ్రుతులు "యస్మై నమస్తేఽస్తు సోముఁ" డనఁగ
మ్రొక్క నెలకొనుకర్త రుద్రుండె యనుచు
నొప్పు వేదాభివందనీయునకు మ్రొక్కి
వసుధ రచియింతు నీకృతి బసవలింగ ! 2

శ్రుతి "శతాయుర్వైపురుష" యనఁ గాలంబుఁ
జని మీఱు మాదిరాజప్రభుండు
నదిగాక శ్రుతి "సర్వమన్యత్పరిత్యజ్య"
యనఁ బరిత్యాగుండు అల్లమయ్య
శ్రుతి "ఏకఏవ రుద్రో" యన రుద్రావ
తారుండు శంకరదాసమయ్య
మఱి శ్రుతి "వృషభసమాహూతి" యనఁగను
బరగు మా బండారి బసవవిభుఁడు
ఆదిగా నఖిల మహాపురాతనభక్త
పాదసరసిజముల భక్తిఁ దాల్చి
నిర్వికల్పరతిఁ జతుర్వేదసార మన్
పద్యముల్ రచింతు బసవలింగ ! 3

లీనమంత్రస్థానమానహోంబుధసంగ
మైనట్టి సిద్ధరామార్యవిభుఁడు
భువిఁ "బుల్కసోనై వపుల్కసో" యనఁ గుల
శ్రేష్ఠుండు మాదరచెన్నమయ్య
లోలత "నైవచండాలో" యనఁగ గణ
నాథుండు మా శివనాగమయ్య
ధర నిచ్చను "వ్రతమేతచ్ఛాంభవ" మ్మన
శాంభవదీక్షానుసారి నంబి

యాదిగా నఖిలమహాపురాతనభక్త
పాదసరసిజములు భక్తిఁ దాల్చి
నిర్వికల్పరతిఁ జతుర్వేదసార మన్
పద్యముల్ రచింతు బసవలింగ ! 4

వావిరి "నాచార్యదేవోభవ" యనంగఁ
బరగిన యాచార్యపండితయ్య
ఘన "కృత్తివాససే" యన గజాజినధర
మదకరి మడివాళ మాచశౌరి
రమణఁ "దద్విష్ణోఃపరం" బను తన్నిష్ఠఁ
బరగిన పోడ్డలబాచిరాజు
ఏపార "నిర్మాల్యమేవ నేకత" యనఁ
బరమపావన బసవప్రసాది

యాది గాఁగ భువి మహాపురాతనభక్త
పాదసరసిజముల భక్తిఁ దాల్చి
నిర్వికల్పరతిఁ జతుర్వేదసార మన్
పద్యముల్ రచింతు బసవలింగ ! 5

అగు "నసంఖ్యాతసహస్రాణి" నా నసం
ఖ్యాత మగు ప్రమథగణసమూహి
యాశ్చర్యగవ్య మీ పార్శ్వత్రియై చను
గణుతింపఁ దగు రుద్రగణసమూహి
సారంబుగా "శివాఘోరతనూపాప
కాశినీ" యన భక్తగణసమూహి
తివిరి "నానావ్రతస్తేన ఏవావృత్తి"
గలుగు వీరవ్రతగణసమూహి

యాది గాఁగ భువి మహాపురాతనభక్త
పాదసరసిజముల భక్తిఁ దాల్చి
నిర్వికల్పరతిఁ జతుర్వేదసార మన్
పద్యముల్ రచింతు బసవలింగ ! 6

విను "తవపుత్రోఽభవిష్యామి" యనుస్మృతి
దనర రెండవశంభుఁ డనియుఁ జెప్ప
ఘన ద్వితీయశ్శంభుఁ డని నుతింపంగ ధ
ర్మాధర్మవిషయ ధర్మస్వరూపి
నయతను "వృష వృషణం స్పృష్ట్వా" యనఁగ స
ర్వాంగపవిత్రుఁ గృపైకపాత్రు
ధర "మమ సర్వథా తద్భవే" త్తన నొప్పు
కరుణాసముద్రునిఁ గలితరుద్రు

వినుత వృషభసమాహూతి వేదవృత్తి
నవ్యరుద్రావతారు శ్రీ నందినాథు
వృషగణాధిపుఁ బశుపతి వినుతిఁ జేసి
యొసఁగ రచియింతు నీకృతి బసవలింగ ! 7

పశుపతి వృషభంబు పశుపతి పరముండు
యనఁగను జెల్లు శుభాక్షరములు
బసవవాక్యంబు పవర్గతృతీయాక్ష
రము బకారము పకారంబువలనఁ
బరగఁ గుద్దాల తామర సకుఠారముల్
వరుస గుద్దలియుఁ దామరయు గొడలి
యనుక్రియను శషోస్స యను వ్యాకరణసూత్ర
మునఁ జొప్పడు సకారమును శకార
మున నహో వాయు తత్సూత్రమున వకార
మును పకారంబునను దోఁచుఁ బొలుపుమీఱ
బసవనా మంచిదియు లింగభావ్య మగుట
బసవలింగాహ్వయం బొప్పు బసవలింగ ! 8

తగ "యస్య వక్త్రేస్థితం దేవి" యన నుండు
నెవ్వనిముఖమునం దెల్లప్రొద్దు
రతి బసవేత్యక్షరత్రయం బమరు వి
భ్రాజితబసవాక్షరత్రయంబు
నెసఁగ "వసామితత్రసతత" మ్మనఁగను
నెవ్వారు వచియింతు రెపుడుఁ బ్రీతి
నరయ "సత్యం సత్య" మన సత్య మిది యన
"నాన్యథా" యన ధర నమరియుండు
ననుచు శంభుండు దేవికి నాన తిచ్చె
సిద్ధరామయ్యచే మఱి చెప్పఁబడియె
నిజము గావున లింగసాన్నిధ్యసుఖము
నొసఁగు మూఁ డక్షరంబులు బసవలింగ ! 9

మును బకారము లైంగ్యమున "బకారో వామ
పార్శ్వతో" యన వామభాగ మయ్యె
నా సకారము "సకారాంత సద్వాచ్యో" య
నంగ వాచ్యం బుమానాథునకును
నా వకారము బకారాభేద మనఁగను
హరునకుఁ దనర వాచ్యార్థ మగును
నా బసవా యను నక్షరత్రయమును
సాక్షి శివాత్మకసరణి గాన
పశుపతి ప్రమోద మందును బసవ యనఁగ
మంత్ర ముత్తమ మగు రుద్రమంత్ర మవని
ముఖ్యము జపంబు సల్పిన పుణ్యరాశి
ఫలము మూఁ డక్షరంబులు బసవలింగ! 10

తివిరి బకారంబు ధీ వకారంబును
బ్రణుతింప నటుగాన బ్రణవ మదియుఁ
జెలఁగి నకార కించిద్భేద మా సకా
రాకృతి గాన తదంశ మఱియు
సంగతాంతర్గత శృంగ మకారప్ర
కారంబు గాన వకార మదియు
బసవాక్షరంబు లేర్పడ శివునకుఁ బ్రీతి
గాన శివా యనఁ బూనె నవియు
ఓ న్నమశ్శివాయ యనెడి సన్నుతాక్ష
రములఁ జెందును బసవాక్షరత్రయంబు
గాన శ్రీషడక్షరజపానూనఫలము
నొసఁగు బసవాక్షరంబులు బసవలింగ! 11

మహిఁ బకారంబు "బ్రహ్మ శివో మే యస్తు"
అనఁగ నీశానవక్త్రాత్మకంబు
నొగి సకారంబు సద్యోజాత మితి యన
సరణి సద్యోజాతసంభవంబు
వఱలు వకారంబు వామదేవాన్నితి
యనఁగఁ దద్వామదేవాస్యజంబు
శ్రీలింగపద మఘోరే భ్యోథ ఘోరేభ్య
యనఁగ నఘోరలింగాహ్వయంబు
సహజవృషభంబు తత్పురుషాయ యనఁగ
నాదితత్పురుషంబు శుభాభిజాత
మగు సదాశివనామంబు మహితజపిత
ఫలము బసవాక్షరము లిచ్చు బసవలింగ ! 12

బా భర్గున విరళబ్రహ్మంబు గావున
నా బకారంబు శివాత్మకంబు
సా శంభు నాకారసంపద గావున
నా సకారంబు గుర్వాత్మకంబు
వా వరదుని వచోవాసన గావున
నా వకారంబు మంత్రాత్మకంబు
నటు గూడఁ ద్రితయసంపుటము గావున బస
వాక్షరత్రయము లింగాత్మకంబు
నట్టి బసవలింగాక్షర మాది నెన్నఁ
బడును గురుమంత్రోచ్చారణఫలము నొసఁగుఁ
గాన బసవలింగాంకితఖ్యాతి శ్రుతుల
వసుధ రచియింతు నతిభక్తి బసవలింగ ! 13

బసవన్న శ్రీపాదపద్మముల్ భవవార్ధి
పార మందించు తెప్ప లని తలఁచి
బసవన్న శ్రీపాదపద్మముల్ భవచయ
ధ్వాంత మడంచు దీపంబు లనియు
బసవన్న శ్రీపాదపద్మముల్ రాజిలు
భుక్తిముక్తికి సురభూజము లని
బసవన్న శ్రీపాదపద్మముల్ కల్పభూ
జంబుల ప్రథమబీజంబు లనియుఁ

ప్రస్తుతింప నొప్పు బసవాధినాథుని
పాదసరసిజములు భక్తిఁ దాల్చి
నిర్వికల్పరతిఁ జతుర్వేదసార మన్
పద్యముల్ రచింతు బసవలింగ ! 14

బసవన్న మహిమఁ జెప్ప న్విన్నఁ బాయు దు
స్తరనిరంతరమహాతురభయంబు
బసవన్న మతిఁ దలఁప న్విన్నఁ బాయు దు
స్స్వప్న దుశ్శకున దుర్జనభయంబు
బసవన్నఁ బేర్కొన్నఁ బాయు దుర్ధ్వాంతవి
శ్రాంతేంద్రియక్రాంతచింతనంబు
బసవన్న యశ మన్నఁ బైకొన్నఁ బాయు భ
వాటవీచ్ఛన్నదేహాశ్రయంబు

బసవ శరణ న్న ముక్తిసౌభాగ్య మెసఁగు
బసవ శరణ న్న విశ్రుతభక్తి చెందు
బసవ శరణ న్న భక్తిసౌభాగ్యమహిమ
యెసఁగు నని మిమ్ము స్మరియింతు బసవలింగ ! 15

పరవాదిమదగజ ప్రబలపంచాస్యంబు
పరవాదిభూధర వజ్రధార
పరవాదిమేఘ నిర్భరపవమానంబు
పరవాదిభూరుహప్రథితపరశు
పరవాదితస్కర పటుతరశూలంబు
పరవాదిజలనిధిబాడబాగ్ని
పరవాదిలతలకు భాస్వల్లవిత్రంబు
పరవాదిభేకిభీకరముఖాహి
దండనాయకబసవఁ డుద్దండశౌర్యుఁ
డతఁడు పరవాదినిర్వాహరణార్థబుద్ధి
మతము లాఁటింటిఁ జర్చించు మహితసూక్తు
లెసఁగ రచియింతు వసుమతి బసవలింగ ! 16

భక్తచింతామణి భక్తచూడామణి
భక్తైకనుతుఁడు సద్భక్తియుతుఁడు
భక్తసత్ప్రాణుండు భక్తకళ్యాణుండు
భక్తసంబంధుండు భక్తివిభుఁడు
భక్తవిధేయుండు భక్తసహాయుండు
భక్తకింకరుఁడు సద్భక్తిపరుఁడు
భక్తాంతరంగుండు భక్తాబ్జభృంగుండు
భక్తహృన్మయుఁడు సద్భక్తిచయుఁడు
దండనాథుండు బసవఁ డుదగ్రదర్పిష్ఠుఁ
డాదివృషభుండు భక్తహితార్థబుద్ధి
మతము లాఁటింటిఁ జర్చించు మహితసూక్తు
లెసఁగ రచియింతు వసుమతి బసవలింగ ! 17

ఈకృతి రచియించి యీలోకమందుఁ బ్ర
తిష్ఠింతు నీశ్వరాధిక్యమహిమ
నీకృతి పాలించి యీలోకమందు సం
పాదింతు జంగమపాత్రమహిమ
నీకృతి యొనరించి యీలోకమం దను
ష్ఠింతుఁ బ్రసాదసంసేవమహిమ
నీకృతి గావించి యీలోకమునఁ బ్రతి
పాదింతుఁ బటుతరభక్తిమహిమ
నాదివృషభాంశజుఁడు బసవాధినాథుఁ
డిట్టి కృతినాథుకృపచేత నిప్పు డాంధ్ర
భాషఁ బ్రకటింతుఁ బద్యప్రబంధముగను
వసుధ సత్కవిసమ్మతి బసవలింగ ! 18

శ్రీరుద్ర జాబాల శ్వేతాశ్వతర బృహ
దారణ్య తైత్రీయ మాది గాఁగ
బ్రహ్మబిందువు పంచబ్రహ్మాత్మగర్భ కా
త్యాయనీ శుక్ల కాలాగ్ని రుద్ర
కాపాల శోషీయ గాల వాజసనేయ
శాండిల్య ప్రశ్న సుశంఖ హంస
పవమాన కైవల్య బాష్కల సశివ సం
కల్పనారాయణ కాండవాది
శాఖలం దుపనిషచ్ఛయమం దథర్వణ
ఋగ్వేద సామము లెంచి మించి
శ్రుతి పురాణాగమములందు శుద్ధవీర
శైవమునకును దగినట్టి సరణు లెల్లఁ
జేర్చి మీకృపవలనను జెడని భక్తి
పదముచేత రచించెద బసవలింగ ! 19

పద్యగణాక్షరపరిమితోదాత్తాను
దాత్తస్వరాదులు దప్పకుండ
ధాతుశబ్దాళిసూక్తముతోడఁ జేరిన
వాక్యముల్ సంప్రీతి వచ్చియుండ
స్వరవర్ణపదబంధసంధిన్యూనాతిరి
క్తప్రయోగంబులు గలుగకుండ
నిజపదవాక్యార్థనిర్ణయోక్తులతోడఁ
బైయర్థములు దప్పఁ బడకయుండ
నలరు నుపనిషద్వేదసూక్తులకు భాష్య
మునకు నైఘంటికంబుల కనుగుణంబు
లగు పురాణస్మృతీతిహాసాగమోక్తు
లెసఁగ రచియింతు నీకృతి బసవలింగ! 20

శ్రుతుల "దామూమతి ప్రతిరిష్యతి" యనంగఁ
గల్వార్థ మేకంబుగాను తుష్ట
సంచయ "మాప్నోతి సహాసాయతి" యనంగ
శ్రుతులు పురాణోక్తతతులు గాఁగ
శ్రుతిస్మృతులకు విరుద్ధత్వ మున్నఁ ద
త్పార మొల్లరు బుధవరులు గాన
అల శైవ వైష్ణవాదు లనర్హవాక్యమం
చనియెద రితరవాక్యములు గాన
నొగి శ్రుతిస్మృతులకు యుక్తంబుగాఁ బురా
ణాగమాదిసూక్తు లతిశయిల్ల
భాష్యరీతిఁ దేటపఱతు నుద్యద్భక్తి
పథము విస్తరిల్ల బసవలింగ! 21

శ్రుతి కల్పభూజసంచితబీజభావన
"నగ్నిమీళే" యన నాది వెలయు
శ్రుతి సుధాంబుధిమధ్యగతిరత్నభాతి "ని
స్సంగతత్పురు" షనంగ వెలయు
శ్రుతి హేమగిరిశృంగరుచి నంత్యమున "సర్వ
మన్యత్పరిత్యాజ్య" యనఁగ వెలయు
శ్రుతి శివక్షేత్రసంతతశాసనస్థితి
నెడనెడఁ బ్రణవమ్మె యిట్లు వెలయు
వేదజన్మభూమి వేదాంతవేద్యుండు
వేదమయుఁడు వేదవినుతకీర్తి
దివ్యలింగమూర్తి భవ్యతేజస్ఫూర్తి
భవుఁడె యాదికర్త బసవలింగ! 26

ఆదియా ఋగ్వేద మది "యగ్నిమీళేపు
రోహిత" మనఁగ నిరూపితముగ
సర్వాగమోత్తరసరణి "సద్భస్మశ
శాంక" మిది యనంగ సంచితముగ
భాష్యసత్సంహిత పరగంగ "జాతవే
దస్థాణు" రనఁగ సంస్థాపితముగ
ధర లైంగ్యమున "జలస్తంభరూపిణి" యనఁ
గడువడి సద్వార్త నుడువఁగాను
నిట్టిధర్మంబు లెల్లను దిట్టముగను
దెలిపెదను నీమహాత్మ్యంబు తేటపడఁగ
నిర్వికల్పరతిఁ జతుర్వేదసారమున్
వెస రచింతు నేను బసవలింగ! 27

అలరుచు ఋగ్వేద మటు "ఏక ఏవ రు
ద్రోనద్వితీయ" నా రూఢిఁ దగిలి
తగ యజుర్వేదంబు దా "నమస్తే అస్తు
రుద్రరూపేభ్య" నా రూఢిఁ బొగడ
నిమ్మగ సామవేదమ్ము "విశ్వాధికో
రుద్ర మహర్షి" నా రూఢిఁ దగిలి
యొగి నథర్వణవేద "మూర్ధ్వబాహావె" యన
"రుద్రస్తువంతి" నా రూఢిఁ దగిలి
పరగ లింగమూర్తి భావవశ్యం డగు
కలిమి మెఱసి బందికాండ్రఁ జేసి
వంగకాయలట్లు లింగములఁ గాఁ జూచు
ప్రతిభ మీఁకె యొప్పు బసవలింగ ! 28

పొంగారుసమ్మతి "లింగమధ్యే జగ
త్సర్వం" బనంగ శాస్త్రంబులందు
అలరి "లింగాంకితం" బయ్యె "జగద్భరి
తం" బన నారుషేయంబులందు
స్థితిఁ "బ్రళయాంతవ్రజేద్దీపితేనలిం
గ" మనంగ విమలాగమము దలఁప
నరిది శ్రీకొన్నెల నా "లింగ ముచ్యతే"
యనునట్లు శివరహస్యంబులందుఁ
బరగు లింగమూర్తి భావవశ్యం డగు
కలిమి మెఱసి బందికాండ్రఁ జేసి
వంగకాయలట్లు లింగములఁ గాఁ జూచు
ప్రతిభ మీఁకె యొప్పు బసవలింగ ! 29

శ్రుతి "అహ మ్మేవ పశూనా మధిపతి ర
సావితి" యనఁగ విస్ఫారమహిమ
వర్ణన కెక్క "శర్వాయ చ పశుపత
యే చ నమో" యన నిద్ధమహిమఁ
బ్రబలి "ఇమం పశుపత యే చ తే యద్య
బధ్నామి" యనఁగ నపారమహిమ
వ్యాపితలీల "నుమాపతయే పశు
పతయే నమో" యన నతులమహిమఁ
బరగుఁ గాన శివుఁడె పశుపతి యజహరిం
ద్రాదు లెల్లఁ బశువు లనెడుశ్రుతులు
చదివి చదివి కూళ లది యెట్లకో శివ
భక్తిహీను లైరి బసవలింగ ! 30

శ్రుతి "విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో
విశ్వతో బాహు" నా విమలకీర్తి
యలర "నణోరణీయాన్మహతోమహీ
యా" నన విశ్వతోవ్యాప్తమూర్తి
యొనరఁ దా నభిరతి "నో న్నమో నమ" యన
నతులితమహిమ మహత్త్వపూర్తి
మహిమ దీపింప "సోమః పవ తేజని
తామతీ నా" మన ధన్యకీర్తి
శివుఁడె యంచు సకలశిష్టులు పలుకంగ
మ్రోయునట్టి వేదములు దొడంగి
చదివి చదివి కూళ లదియెట్లకో శివ
భక్తిహీను లైరి బసవలింగ ! 31

జగతిలోపలను "యస్మాత్పరం నాస్తి" నాఁ
బరమపరునిమీఁదఁ బరము గలదె
యింపారగా "ఏక ఏవ రుద్రోచ్యతే"
యనఁగ రెండవరుద్రుఁ డావిఁ గలఁడె
కూర్మిమై "సశివ ఏకోధ్యేయ" యనఁగ ధ్యే
యుండు శివుండు వేఱొండు గలఁడె
యిల "అపరస్య మహేశ్వరో" యన మహే
శ్వరుపైని మఱి మహేశ్వరుఁడు గలఁడె
యటులు శంకరుఁడు మహాదేవుఁ డీశానుఁ
డఖిలవేదవేద్యుఁ డభవుఁ డుండ
నితరసురలఁ గూళ లెట్లొకో భజియించి
భవనిమగ్నులైరి బసవలింగ! 32

ఇంపారగా "పశూనాం పతయే నమో"
యనఁగను బశుపతి యైనవాఁడు
భాతిమీఱ "దిశాంచపతయే నమో నమో"
యనఁగ దిశాపతి యైనవాఁడు
తేజరిల్ల "గణపతిభ్యశ్చవో నమో"
యనఁగ గణాధ్యక్షుఁ డైనవాఁడు
తేటపడ "సభాపతిభ్యశ్చవో నమో"
యనఁగ సభాపతి యైనవాఁడు
ధ్యేయుఁ డనుచును సురలు నుతింపుచుండ
శిష్టజను లెల్ల హరుఁడె ప్రశ్రేష్ఠుఁ డనఁగ
భవుని మఱి రుద్రసూక్తులు ప్రస్తుతించు
భంగి నెఱుఁగరో కూళలు బసవలింగ! 33

తెల్లంబుగా "స్మర్య తే న చ దృశ్యతే"
యనుచు వేదములు తథ్యంబు వలుక
సుప్రసిద్ధంబుగా "నప్రాప్య మనసా న
హా" యని శ్రుతి నిశ్చయంబుఁ బలుక
నారూఢముగను "వేదారహస్యప్రోక్త"
మనుచు వేదంబులు నట్లు పలుకఁ
దేటపడఁగ "సత్యతిష్ఠద్దశాంగుళం"
బనుచు వేదంబు లత్యర్థిఁ బలుక
నట్లు శంకరుఁడు మహాదేవుఁ డీశానుఁ
డఖిలవేదవేద్యుఁ డభవుఁ డుండ
నితరసురలఁ గూళ లెట్లొకో భజియించి
భవనిమగ్నులైరి బసవలింగ ! 34

వ్యాసభుజంబు విన్యాసంబు గా దన్నఁ
గాశిని రంజిల్లు గంగ సాక్షి
ఘనతఁ గాశీఖండమున "సర్వజలజాత
ముపహర్తు" మనఁగ సముద్ధతముగ
"నంగుష్ఠతర్జనీభ్యశ్చ భస్మద్వార"
మనఁగఁ దదీయోక్తి నంచితముగ
నెఱి నంది "పూర్వవినిస్సుతాదే" వన
ముల్లోకములు గూడ ముంచినట్టి
గంగ నిరతంబు నీజటాగ్రంబుఁ జొచ్చి
గానరాకున్న మఱి నఖాగ్రంబు విద్రువ
వెలికిఁ బఱతెంచు టెఱుఁగరే వెఱ్ఱిజనులు
భర్గుమహిమంబు దెలియరు బసవలింగ ! 35

క్షోణిపై వెలసెడి కేనోపనిష దుక్తి
"ఇద మిద మిద" మని యేర్పఱుపఁగ
నెఱి యజుర్వేదోపనిషది "విషం తృణా
గ్ర మపి న చలతి" నా స్కాందమునను
స్వాధ్యాయనోపనిషత్సూక్తి "నాచల
యతితృణం" బనఁగ గ్రంథాంతరమునఁ
జనవార లైంగ్యంబునను "తృణం వాపి య
దుశ్చ పశ్యతి" యని గణన సేయఁ
యక్షనాయకుఁ డాదిగా ననవరతము
హరి మునీంద్రులు గరుడులు సురలు పరగఁ
బొగడుచుండు టెఱుంగరే భూమిజనులు
ప్రాకృతులు గాక వేఱొండె బసవలింగ! 36

ధర "గదాభ్యః పూత" యనుచు నా
దిత్యపురాణంబు దివిరి పొగడ
నింపార "నారాయణం పుమానత్యయ"
యని తత్పురాణంబు వినుతి సేయ
మొదల సౌరపురాణమున "రంజితో మేరు
పర్వతో" యనుచును బ్రస్తుతింప
యుక్తి "సంతర్పితే నోక్తం దివౌకస"
యని తత్పురాణంబు వినుతి సేయ
నిన్నివిధముల శ్రుతిపురాణేతిహాస
వాక్యములు మ్రోయుచుండంగ వసుధఁ గూళ
లిది నిజం బని తెలియ రదేమొగాని
ప్రాకృతులు పాపమతు లైరి బసవలింగ! 37

ధరఁ "దృణబిం ద్వన్యథా సహి" యనియెడుఁ
గాదె శ్రీకాళికాఖండసూక్తి
జలజజవాక్యంబు "శంభుభక్త్యా చ స
ర్వేషా" మనంగ సద్వ్యక్తి గాదె
మొదలఁ "బాశుపతేన ముక్తిర్న్కృపస్తేన
కాంస్యా" యనంగను గ్రతుఫలంబు
వ్యక్తిఁ గాశీఖండసూక్తి "దాస్యామి స
ర్వేషా" మనంగను విన రదేమొ
దవిలి "విద్యానమృత ఇహ భవతి"యనుచు
వేదపురుషుండు దాఁ జెప్పఁ గాదె యిట్లు
కాన ముక్తుల కెల్లను గారణంబు
భర్గపాదాబ్జభక్తియే బసవలింగ! 38

ఒనరు లింగపురాణమున "వేదతేచ దు
రాత్మా" న యన నిశ్చయంబు గాదె
స్కాందపురాణాదిసంహితసూక్తి "య
స్స్మరతి పఠంతి" నా మఱచి రెట్లు
లననేల సూతగీతిని "యథాస్యాపాన
మో" యన సమబుద్ధి యుడుగ రెట్లు
స్కాందపురాణసంగతి "శ్వపచాధమో"
యను సూక్తిఁ దప్పక యరయ రెట్లు
రూఢి మీఱ శ్వేతాశ్వేతరోపనిషది
నట్లు "దేవా ననంతా" ననంగ మఱియుఁ
గడఁగి విష్ణ్వాదులను గరకంతుఁ బోల్చు
పాపులను జూడఁబోలునే బసవలింగ! 39

స్రష్ట వేధించెఁ "ప్రజాపతిర్విశ్వా మ
హా"ర్తనా దనఁ గూఁతు నతఁడు గలియ
గర్వింపఁ "గర్త్తోపకర్త్స్యవదనంబు"
ననఁగ బ్రహ్మశిరంబుఁ దునిమివైచె
నాగిఁ "బురాత్మన్యేవ చోష్ట్రత్వా" యన బ్రహ్మ
సుతుని నుష్ట్రముఁ జేసె నతఁడు గ్రొవ్వ
జగతిఁ "ద్రిపురమదశాసినే యస్తేచ"
యనఁగను వేగఁ గట్టలుకఁ దుడిచె
నంగజుఁడు "లలాటస్థహుతాశనే" యన
నంగజుని వ్రచ్చి నిటలనేత్రాగ్నిఁ గాల్చెఁ
గాన నద్వైతులకు జగత్కంటకులకుఁ
బాటు తప్పునే హరుచేత బసవలింగ! 40

శ్రీవీరభద్రుఁ డారిచి యజ్ఞపురుషునిఁ
బలుపుట సూర్యునిపళ్ళు డుల్చి
యగ్నిచేతులును జిహ్వాలు గోసివైచుట
భగునికన్నులు దీసి జగతి నూకి
మునులను రోషించి మొదటఁ జంద్రునిఁ బట్టి
ధరణిపైఁ బడవైచి తన్నుటయును
నదితి చన్మక్కు శారదముక్కు గోయుట
తఱిమి సురలనెల్లఁ దఱుఁగుటయును
మఱియు దీక్షితులను బట్టి మదము దగ న
ణంచి "రుద్యేహతే" యన నధ్వరస్య
యనఁగ మొదలఁ దా "నిదమస్తు" హవ్య మనఁగఁ
బాటు దప్పునె హరుచేత బసవలింగ! 41

మహిని రుద్రుండు "చర్మాంబరో శ్రీభవే"
త్తనఁగ వ్యాఘ్రాసురు నద్భుతముగ
నడఁచె శంభుఁడు "పాదహస్తయుతం చర్మ"
మనఁగ గజాసురు నతులితముగఁ
జీఱె శరభుఁడు "నృసింహాజినాంబరో"
యన నృసింహాజినం బక్కజముగ
ఖండించె వీరభద్రుండు "సయజ్ఞస్య"
యనఁగ యజ్ఞపురుషు నచ్చెరువుగఁ
గట్టి పట్టి కొట్టి కారించి మించెను
సకలసురలు మునులు సన్నుతింప
క్షితిని "కృత్తివాససే" యను శ్రుత్యుక్తి
ప్రత్యయంబు గాదె బసవలింగ! 42

"క్రియకరోదేవవికీర్తితోయకరో సు
సతరవ" త్తన సూతసంహితలను
"క్రీడనకాయేవ క్రీడనకా" యను
కాళికాఖండ సూక్తములు మఱియు
"యస్యకింకథ నైవ" యాదిత్యసూక్తి త
త్సూక్తిని "నైవప్రసూతి" యనఁగఁ
దవిలి మును "శుకవ"త్తనఁ "బ్రళయోదయో"
యనఁగను సిశుక్రీడార్థ మైన
పశువు లుష్ట్రంబు లశ్వముల్ బంట్లు సురలు
క్రీడ సల్పును శంభుండు చూడఁ జూడఁ
జచ్చి పుట్టెడువారలు శంభుసరియె
బ్రహ్మ విష్ణ్వాదిదేవతల్ బసవలింగ! 43

పొడువకుండఁగ నోడుఁ బొడువంగ నోడు శి
వాజ్ఞను మీఱి యహంకారుండు
వీవకుండఁగ నోడు వీవంగ నోడు శి
వాజ్ఞను మీఱి మహానిలుండు
కాలకుండఁగ నోడుఁ గాలంగ నోడు శి
వాజ్ఞను మీఱి హుతాశనుండు
కురియింపమికి నోడుఁ గురియింప నోడు శి
వాజ్ఞకు వెఱచి వజ్రాయుధుండు
చంపకుండఁగ నోడును జంప నోడు
మృడునియాజ్ఞను మీఱియు మృత్యు దండ
ధర విధాత లోడుదురట "ధావతి" యని
పరగ శ్రుతులిట్టులను మ్రోయు బసవలింగ! 44

గిరిజేశునకు "నతఃపర" మున్నదే "నాస్తి
లింగాత్పరం" బని లీల మ్రోయు
మృడునకు సరి గలఁడే "నభూతో నభ
విష్యతి" యనుచు సద్వృత్తిఁ బలుక
హరుఁడు సాధారణుం డనఁగను గూడునే
"సోంత్యజో" యనఁగను సూక్తి యెఱిఁగి
భవు నొరుం బోల్పఁ బాపంబు గాదె "పతంతి
యమశాసనే" యన నట్లు మఱియు
శ్రుతి శిరస్సమూహి "పతిరేకయాశీ" త్త
నుచు వచింప దుర్గుణులు మదించి
యితరసురలఁ బట్టి పతితులు సన్ముక్తి
బాహ్యు లగు టదేమి బసవలింగ! 45

"కాచ మన్యం"చనాఁ గాజుఁబెంచికలు ర
త్నము లుండ నేరు దుర్నయునిఁ బోలు
"గూపంఖనతి" యన గూపంబులట్ల జా
హ్నవిని దలంచు దుర్నరునిఁ బోలుఁ
"బూజం త్యజే"త్తనం బో నోడ యుండంగ
వడరూది నిలిచిన వదరుఁ బోలు
ధర "సురగా" యన సురధేను వుండంగ
గొడ్డు పితుక నేఁగు కుమతిఁ బోలు
నట్ల "చర్మవదాకాశ" మనఁగఁ గనియు
సరణి గవయంగఁ గోరెడు జడునిఁ బోలు
నిన్నుఁ గొల్వక యొరుఁ గొల్చు నీచమతులు
వసుధ శ్రుతులు చెప్పెడుఁగాదె బసవలింగ ! 46

కారణోక్తుల "న గురోరధికం న గు
రోరధికం" బని రూఢిఁ బొగడ
నిల "గురురూపో మహేశ్వరో" యనుచు స
ర్వాగమోత్తరములు నర్థిఁ బొగడ
మఱి "గురురూపం సమాదాయ" యనుచుఁ గ్రి
యాతిలకంబు నత్యర్థిఁ బొగడ
వారక "నాస్తి తత్త్వం గురోః పర" మని
యారుషేయంబులు గోరి పొగడ
శ్రుతులు "నాచార్యదేవో భవతి" యనంగ
సకలభుక్తిముక్తిప్రదాయకుఁడు గురుఁడు
శివుఁడు గురుమూర్తి పరసదాశివుఁడ యనుచుఁ
బ్రస్తుతించెదు గురుమూర్తి బసవలింగ ! 47

దీపితమతి "నద్వితీయోస్తి కుత్ర చి"
త్తనుచు శ్రీలైంగ్యంబు వినుతి సేయ
మతి "శతరుద్రీయ మధ్యగా" యనుచు న
య్యాజ్ఞవైభవఖండ మర్థిఁ బొగడ
కారణాగమము "మంత్రై రుపమంత్రై ర
నేకథా" యనుచును నియతిఁ బొగడ
నయ్యాగమంబు "విద్యాజపతో ఆప్ను
యాచ్ఛివం" బనుచు నత్యర్థిఁ జదువ
ధరను "యదజనాత్తదా" యని శాస్త్రంబు
లను నమశ్శివాయ యనుచు శ్రుతులు
భక్తి మ్రొక్కఁ బరగు పంచాక్షరస్వరూ
పంబు శివుఁడు గాదె బసవలింగ! 48

శ్రీశివధర్మోక్తిఁ "గ్రీడమానోపి యః
కుర్యా" త్తనంగ నకుంఠితముగ
మఱి "పాంసవఃక్రీయమానోపిశ్లింగంబు
శయనం" తదీయోక్తి సంగతముగ
లైంగ్యంబునందు "బాలానాం చ భజ శివ"
మ్మనుచుఁ "గృత్వా" యన నంచితముగ
నాసారమున "మృణ్మయం చాపి సంభవ
త్వే భూభుజ" యనఁగ వితతముగను
ఇసుక లోష్టంబునను మంటి వసుధ లింగ
మూర్తిఁ గావించి కొల్చిన ముక్తి యగును
బాలురకు నన్నఁ బ్రత్యక్షభవ్యలింగ
భజనఫల మెన్న శక్యంబె బసవలింగ! 49

తివిరి ఋగ్వేద "మస్థితయతి సాలభ్య
  తేభ్యో" యనంగ సత్క్రియ దలిర్ప
నా యజుర్వేద "మింద్రాయతి సప్తాశ్వ
  తేభ్యో" యనంగ భక్తియుఁ దలిర్పఁ
దవిలియు వాయు "యథా దైవతా" యని
  "యజ్ఞ ముపచరతి" యనుచుఁ బొగడఁ
దాను వెండియు "యోగదైవతా" యనుచును
  "యజ్ఞ ముపచరతి" యనుచుఁ బలుక
హింస గావించి పడయు నా యింద్రపదవి
వాయుసూక్తిని "తద్ధళం వా" యనంగఁ
బుడిసెఁ డుదకంబు పైఁ బోసి పువ్వుతేకు
భర్గుఁ బూజింపఁ జాలదే బసవలింగ ! 50

ఐశ్వర్య మర్థించి యమరులు "శ్రుతి మరి
  తోత్త్రథయం" తనాఁ దొడరి కొలువ
సన్మునీంద్రులు క్రియాసఫలత కర్థించి
  "జయజయా" యని భక్తినియతిఁ బొగడ
యతివరుల్ మోక్షార్థులై బ్రహ్మలోకప
  దాన్వేషు లగుచు నత్యర్థిఁ గొలువ
నిత్యపూజానిష్ఠ మృత్యుహారముగా "య
  జా మహే" యని భక్తజనులు గొలువ
నర్భకుల్ గర్భదుఃఖాపహారణముగను
"త్వాం ప్రపద్యే" యనుచును జిత్తమునఁ గొలువ
నభిమతార్థంబు లొసఁగు లింగార్చన ప్ర
భావ మెంచరు కూళలు బసవలింగ ! 51

నలి లైంగ్య మనుపురాణము "సూకరో" యన
నొగి గణత్వము నొందె నొక్కపంది
తనర శివరహస్యమున "విదీపో గత
ప్రాయో" యనఁగ ముక్తి వడసె దొంగ
ఆ హరప్రాసాద మనుసంహితను జెప్పి
యొగి మోక్షమును జెందె నొక్కరాజు
ముక్తి వడసెఁ గరి ముక్తిఖండమున "నా
థా యనాథా" యను తత్త్వమునను
లింగసాహస్రతయును సత్సంగతోక్తి
విభుధవర్గంబు చెప్పినవిధము భస్మ
ధరునకును మున్ను సద్గతి దనరెఁగాదె
భక్తి నే మని చెప్పుదు బసవలింగ! 52

తప్పక భృగుసంహితను "యః శివేతి స్మ
రే త్కించి" దనుచు సత్క్రియఁ దలిర్ప
ఘనమైన విష్ణువాక్యము "శివమే వాను
చింతయే" త్తనుచు సంస్మృతిఁ దలిర్ప
సతతంబు శ్రీభాగవతపురాణంబున
"శివ శివే" యంచును జెలఁగి ప్రోయ
మున్ను కూర్మపురాణమున "శివ ఇత్యక్ష
రద్వయం" బనుచుఁ బురాణవితతి
చెలఁగి యిట్లు ప్రోయు "శివ శివ శివదేవ"
యనుచు శ్రుతులుఁ బొగడునట్లు గాన
శివునిఁ దలఁచుమాత్ర సిద్ధించు నపవర్గ
పదవి యొండు లేల బసవలింగ! 53

తగఁ "క్రిమికీటపతంగోపి" యనుచు నా
శివరహస్యంబునఁ జెప్పెఁ గాన
యేపార "నరక సయేవ పశుత్వం చ"
యను సంహితోక్తుల నమరఁ గాన
పరికింప "జన్మస్య పాక మధ్యా" యని
వాయవీయంబున వఱలఁ గాన
ప్రకటింప "మానుషారాక్షసా" యనుచు న
నామయంబును గడు సర్థి బ్రోయఁ
బరగు శ్రుతి "భవామ శరదశ్శత" మటంచుఁ
జాటుఁ గాన సకలసౌఖ్యములకు
నిక్క మేకలింగనిష్ఠాపరత్వాను
భవసుఖంబు పదము బసవలింగ ! 54

## విభూతి రుద్రాక్ష లింగధారణ మాహాత్మ్యము

విశ్రుతాథర్వణాదిశ్రుతిసంధాన
మున సమర్థించు విభూతిభాతి
రూపింపఁ గాలాగ్ని రుద్రాద్యుపనిషచ్చ
యమున రక్షావగాహము ఘనంబు
తివిరి శాతాతపద్వితయవిజ్ఞానేశ్వ
రాదిస్మృతులు తీర మనుచుఁ జెప్ప
బ్రహ్మకూర్మాదిపురాణముల్ గుమిగూడి
క్రమమున భస్మధారణముగుణము
సన్నుతించు జాబాలాదిశాఖలందు
భసితమును దప్పక ధరించుఫలము దివిరి
యిట్టిసూత్రములఁ దెలిసి యెలమి మీఱ
భాష్యసూక్తులు గాన్పించు బసవలింగ ! 55

చర్పింప శివధర్మశాస్త్రంబు దా "స్నాన
మాగ్నేయ మాచరే" త్తనుచుఁ బొగడఁ
బ్రకటింప వాయుపురాణంబు "భస్మనా
చ త్రిపుండ్రక" మని సంస్తుతింప
సంధిల్ల లైంగ్యంబు "సర్వతీర్థావగా
హంబు భూతిస్నాన" మనుచుఁ జదువ
నలి భవిష్యత్పురాణమున "భసితతను
మాపురా" యనుచు సమాఖ్య సేయఁ
జను పురాణయుక్తి శాఖోపనిషదాగ
మాదిధర్మములును మహితవృత్తి
వినుతి సేయుచుండ వేదురు లాభూతి
బాహ్యు లగు టదేమి బసవలింగ! 56

తనర శ్రీలైంగ్యంబునను "మస్తకే వాపి
ధారయే" త్తనుచు నాదట నుతింప
నిపుణత వెలయు వాయుపురాణమునను "రు
ద్రాక్షధారణ" యన నతిశయిల్లఁ
బ్రతిభతో స్కాందపురాణంబునను "మృణ్మ
యం చాపి రుద్రాక్ష" మనుచుఁ జెప్ప
నాదిశివపురాణమందును "శ్వాపి వా
మృతి" యని యర్థిమై మేళవింప
మూలసంహితలును మొగి వేదములు గూడ
విశదముగను బ్రోయ వేదురులును
శ్రుతిహితంబు గాఁగ రుద్రాక్షలను గర్మ
ఫలమె దాల్పకునికి బసవలింగ! 57

రుద్రాక్షధారులు రూఢిమైఁ బ్రమథులు
తత్స్వరూపములు వేదములు ఋషులు
వసువులు బ్రహ్మలు వరరుద్రు లర్కులు
గరుడులు హరి పురోగమపురారు
లష్టతనువులు శాస్త్రాగమకర్తలు
సావిత్రి గాయత్రి శక్తిచయము
దానవుల్ మానవుల్ తపసులు యోగులు
సిద్ధులు సాధ్యులు శ్రేష్ఠబుధులు
నల పురాణయుక్తి నట్లె "వేదాధార
యఁతి" యనుచు శ్రుతులు నలర భవులు
శ్రుతిహితంబు గాఁగ రుద్రాక్షలను గర్మ
ఫలమె దాల్పకునికి బసవలింగ ! 58

నియతిఁ బ్రహర్షంబుమెయిఁ "బ్రాణలింగం ధ
రేత్సుధీ" యనుచు సారెకును బలుక
నర్థిమై "ధారయే ద్యస్తు హస్తేన లిం
గాకార" మనుచు నస్తోకలీల
నవిరళప్రీతిమై "శివలింగధారణం
కుర్యా" త్తనుచు నతిధైర్యలీల
నొనర "వక్త్రాధార్య నోచ్ఛిష్ట మితి నిశ్చి
తం" బనుచుఁ బురాణతతి నుతింప
సారముగ "శివాతనూరఘోరాపాప
కాశిని" యనుశ్రుతులు గలుగునట్లు
చదివి చదివి దుష్టజనులు గొందఱు లింగ
బాహ్యు లగు టదేమి బసవలింగ ! 59

వావిరి "క్రియత దైవానుసాన్నిధ్యాన్న
తే ప్రకృతి" యని యుద్దీపితముగ
నిర్వికల్పానూననియతి శ్రుతి "సభవ
తోలింగ" మనుచును ధ్రువము గాఁగఁ
దాత్పర్యమునను "సత్తామాత్రద్వితయచే"
త్తనుచుఁ బురాణచయము కథింపఁ
బ్రాణపద్ధతి "నీశ్వరేణ వినా భావ
సంబంధ" మనుచును సంగతముగ
మఱియు నొగి "శివాభిమర్శనో" యనుచును
బొంగి వేదములు చెలంగి మ్రోయఁ
జదివి చదివి దుష్టజనులు గొందఱు లింగ
బాహ్యు లగు టదేమి బసవలింగ! 60

లీల విష్ణుం డింద్రనీలంపులింగంబు
ననయంబు దనసజ్జయందుఁ దాల్పఁ
గమలాసనుఁడు చంద్రకాంతలింగంబును
ననయంబు దనసజ్జయందుఁ దాల్పఁ
దామరసఖుఁడు దాఁ దామ్రలింగంబును
ననయంబు దనసజ్జయందుఁ దాల్పఁ
దారాధిపతియు ముక్తామయలింగంబు
ననయంబు దనసజ్జయందుఁ దాల్ప
నింద్ర యమ వరుణ ధనేంద్రు లంబుజరాగ
వజ్ర మరకతాది వర్ణలింగ
ములు ధరించి కొలువ మూఢు లెల్లను లింగ
బాహ్యు లగు టదేమి బసవలింగ! 61

కృష్ణేశ్వరుం డని కృష్ణుండు గొల్చుట
మహి విష్ణువాదులు మఱచిరయ్య
బ్రహ్మేశ్వరుం డని బ్రహ్మయుఁ గొలుచుట
యేకాత్మవాదు లె ట్లెఱుఁగరయ్య
దేవేశ్వరుం డని దేవతల్ గొలుచుట
కర్మవాదులు దీనిఁ గానరయ్య
సర్వేశ్వరుం డని సన్మునుల్ గొలుచుట
శూన్యవాదులు దీనిఁ జూడరయ్య
దివిజ దనుజ మనుజ నివహంబు తమ తమ
పేళ్ళమీఁద నీశుపేరు మోపి
యిలఁ బ్రతిష్ఠ సేయు టిదియంతయును జగ
త్ప్రత్యయంబు గాదె బసవలింగ ! 62

ఒనర ఋగ్వేదంబు నొగి "రుద్రశంతమే
భీ" యని యతులగంభీరలీలఁ
జను యజుర్వేదంబునను "తవ రుద్రప్ర
ణీతా" యటంచు విఖ్యాతలీల
నిల సామమున "నఘోరేభ్యో" యటంచును
దవిలి మ్రోయును మహోదాత్తలీలఁ
గన నథర్వణవేదమునను "రుద్రేణాత్త
మశ్నంతి" యనుచు సమగ్రలీల
మ్రోయ నఖిలవేదమూలంబు లింగప్ర
సాద మనుచు విషము శంకరునకు
నర్పితంబుఁ జేసి యారగించినయట్టి
ప్రతిభ మీకె యొప్పు బసవలింగ ! 63

ఒనరంగ వాతూలమున "నుపభోగాయ
భూరితో" యనుచు సంపూరితోక్తి
నలి భవిష్యత్పురాణమునఁ "బ్రసాదోద
కాదితం చైవ" సంపాదితోక్తి
సంధిల్ల వాయవ్యసంహితను "నివేది
తం చ దేవా" యను సంచితోక్తి
మును కాళికాఖండమువ "నివేద్యం చాపి
భక్షయే" త్తను పరిభ్రాజితోక్తి
ప్రేమ బహుపురాణమూలంబు లింగప్ర
సాద మనుచు విషము శంకరునకు
నర్పితంబుఁ జేసి యారగించినయట్టి
ప్రతిభ మీకె యొప్పు బసవలింగ ! 64

ముద మంది శివధర్మమున "నిర్మలత్వాచ్చ
నిర్మాల్య" మనుచు వినిశ్చయముగ
నయ మొప్ప స్కాందమునం "ద్రవిధం చార్పి
తం చైవ" యని విశ్రుతముగ నలరి
ఘన మా శివరహస్యమున "నిష్టలింగస్య
యద్దత్త" మనుచు విఖ్యాతముగను
మొదలను శ్రీశైలింగ్యమున "యదాహారాయ
కల్పితం" బనుచు నఖండలీల
ప్రేమ బహుపురాణమూలంబు లింగప్ర
సాద మనుచు విషము శంకరునకు
నర్పితంబుఁ జేసి యారగించినయట్టి
ప్రతిభ మీకె చెల్లు బసవలింగ ! 65

మేనకాత్మజకు నీశానసంహితయందు
"యది భుంజతే" యని హరుఁడు చెప్పె
శివుఁడు దా లలితభైరవమున "నిర్మాల్య
ధారణం" బని చెప్పెఁ దనసుతునకు
వ్యాసుఁడు శైవంబునందు జైమినికి "దే
వోపభుక్తం" బని యొనరఁ జెప్పె
హరివంశమున వజ్రి కానారదుఁడు చెప్పెఁ
బూని "ప్రసాదభోగేన" యనుచు
నిట్లు పలుకును మఱి పురాణేతిహాస
చయనిరూపితలింగప్రసాదభుక్తి
చమువులకుఁ జర్చలకు నేల సంభవించు
భర్గుకృప లేనిజడునకు బసవలింగ! 66

బ్రహ్మహత్యాదులు పరిహృతం బగుఁ "బాత
కాపహ" మనుచు నిరూపితముగ
నఖిలరోగహరణ మగు "విషదష్టైశ్చ
యాతత" యన జగత్ఖ్యాతముగను
సారూప్య మగుఁ "దత్ప్రసాదోపభోగేన
సారూప్య" మనఁగ నిస్సంశయముగఁ
గలుగు శివైకసుఖము "సుప్రసాదేన
పరశివస్వాయ" మన భాసురముగ
సర్వభువనములకు జనకుం డనంగను
సురలు మునులు పొగడ సుస్థిరముగ
నీప్రసాదమహిమ నెఱుఁగఁజాలరు భువి
భక్తజనసుసంగ బసవలింగ! 67

ఒనర రుద్రపురాణసూక్తి "భుంక్తే శ్రద్ధ
యాన్వితం" బనుచు సమన్వితముగ
నా క్రియాతిలకంబునందున "భక్తగ
ణోచ్ఛిష్ట" మనుచు నత్యురుతరముగ
శివపురాణమునఁ "గించిద్విషగహాసినీ
నీహై" యనంగ వినిర్మితముగ
నైరంతరంబును గోరి "గణప్రసా
దీ" యంచు నిబ్భంగి ద్రమోయు శ్రుతులు
దగిలి సకలప్రసిద్ధప్రసాదంబుఁ గొనఁగఁ
జెప్పలేదె "తేనసహాభుంజీత" యనుచు
మఱియు భక్తప్రసాదంబుమహిమ వేద
పారగులు తామ దెలియరే బసవలింగ ! 68

ధీయుతంబుగ మహాదేవస్య పాదోద
కవిధిఁ జెప్పను నుపక్రమము మీఱ
శ్రీకరంబుగఁ జెప్ప శ్రీశంభుపాదోద
కము శుభం బనుచుఁ ద్రికాలములను
రూపించు శ్రుతులను "రుద్రతీర్థం చ పి
బంతి" యాదూఢ బాహ్యాంతరముల
సత్యంబుగా "ఋతం సత్యం పరబ్రహ్మ"
మని వేదవాక్యముల్ వినుటఁ గాదె
యిటులు వేదజాల మేకమై ఘోషింప
విబుధు లట్టివేదవిధము లెల్ల
నెఱిఁగి యెఱిఁగి పార్వతీశుపాదోదక
బాహ్యు లగు టదేమి బసవలింగ ! 69

పావనం బగును శ్రీపార్వతీశ్వరు మదిఁ
గోరి పాదాంబువుల్ గొనినమాత్రఁ
జెందుఁ గామ్యాభీష్టసిద్ధిప్రదాయక
మనఁగఁ బాదాంబువుల్ గొనినమాత్రఁ
దూలుఁ బాపము పాశజాలము పరిహర
మనఁగఁ బాదాంబువుల్ గొనినమాత్ర
ననునయింపఁగ "గళా నర్వ్తాంతి షోడశ"
యనఁగఁ బాదాంబువుల్ గొనినమాత్ర
నను పురాణయుక్తి చను "దశపూర్వద
శాపరా" యనంగ నట్ల శ్రుతుల
నెఱిఁగి యెఱిఁగి దుష్టు లీశుపాదోదక
బాహ్యు లగు టదేమి బసవలింగ! 70

సురుచిరంబుగ "గతం శూద్రస్య శూద్రత్వ"
మనుచు రహస్యంబులందు మ్రోయుఁ
జతురతరముగ "సచండాలవంశజో"
యనుచు నాగమములు నట్టె మ్రోయుఁ
జోద్యంబుగా "సంత్యజో వాధమోపివా"
యని శైవశాస్త్రంబులందు మ్రోయు
రూపితంబుగ "శ్వపచోపి మునిశ్రేష్ఠ"
యని యారుషేయంబులందు మ్రోయుఁ
గాన భక్తుఁ డగ్రగణ్యుఁ డంత్యజుఁ డైన
శ్రుతులు నమ్మలేనిఁ జూడుఁ డనుచుఁ
దగిలి నాగమయ్య తనువున నమృతంబు
పరగ వెడలలేదె బసవలింగ! 71

మునుకొని యితిహాసమున "సరుద్రో నాత్ర
సంశయ" యనుచుఁ బ్రశంస సేయు
మహితమా రుద్రాగమమ్ములు "తేనైవ
తు సరుద్ర" యనుచు సత్యోక్తిఁ బొగడు
రూపింప శాస్త్రములు "రుద్రలోకాత్పరి
భ్రష్టా" యటంచును బ్రణుతి సేయు
సత్యంబుగా నాదిసంహితలను "రుద్ర
మిహా భూతలే" యని యిల నుతించుఁ
గాన భక్తుఁ డగ్రగణ్యుండు హీనవం
శజుఁ డనంగరాదు చదివి చదివి
దవిలి నాగమయ్య తనువున నమృతంబు
పరగఁ గాంచలేదె బసవలింగ ! 72

మును వీరభద్రీయమున "న యథాపూర్వ
భావనా" యనెడు సంబంధ మెఱిఁగి
ధర "లింగభేదకృతస్మరపూరుషో
నరకం వ్రజే" త్తను న్యాయ మెఱిఁగి
చను కారణాగమమున "శివలింగశి
లాబుద్ధి" యనిన మూలం బెఱింగి
"ద్వాదశలోహముద్రాజ్ఞాత మాలింగ"
మనిన తదీయాగమార్థ మెఱిఁగి
మొదల భక్తునిపూర్వంబు వెదకువాఁడు
పిదప లింగంబుపూర్వంబు వెదకువాఁడు
గాన జంగమలింగంబు హీనుఁ డనెడి
పాపమున కెద్ది నియతమో బసవలింగ ! 73

మొదల శైవపురాణమున "శ్వపచోపి మ
మ ప్రియో" యనఁగ సమంచితముగ
మును పలు శ్రీలైంగ్యమున "మత్ప్రియశ్చతు
ర్వేది" యనుచుఁ జెప్పు విపులముగను
నొనరంగ నా స్కాందమున "శ్వపచో లింగ
పూజకో" యనఁగ విరాజితముగ
నెఱి "శ్వపచోపి ముని శ్రేష్ఠ యస్తు లిం
గార్చనే" యనఁగ నట్లతులితముగఁ
దప్ప కిటులు శ్రుతులు తర్కించి పొగడంగ
నలరుఁ గాన శ్వపచుఁ డైన భక్తి
పరుఁడె యుత్తముండు పరికించిచూడంగఁ
బశుపతిప్రియుండు బసవలింగ! 74

ధృతి "వస్త్రమాత్రం యదృచ్ఛయా" యనుచు నే
ర్పడ వస్త్రదానంబుఫలముఁ జెప్పు
మహి "సువర్ణం చాణుమాత్రకం" బనుచు నే
ర్పడ స్వర్ణదానంబుఫలముఁ జెప్పు
నేమింప "గోష్పాదభూమిమాత్రం" బనఁ
బరగిన భూదానఫలముఁ జెప్పు
నుపమింప "ధేనుబహూపయోధర" యనఁ
బరగ గోదానంబుఫలముఁ జెప్పు
లింగసారంబునందలి లైంగ్యధర్మ
మట్లు గావున నిత్యలింగార్చనునకు
నర్థిమై దానములు సేయునతఁడు సెందు
ఫలము శక్యమె గణుతింప బసవలింగ! 75

సంధిల్ల శివధర్మశాస్త్రంబు "తత్ఫలం
శివయోగినో" యని చెప్పఁ గాన
సఫలత "సప్రమాణఫలార్థిభ్యో" యని
చెలఁగి శాస్త్రము నుతి సేయుఁ గానఁ
జిత్రంబుగా నందు "తత్రభుంక్తే మహా
దేవో" యనుచుఁ బ్రీతిఁ దెలుపుఁ గాన
స్కాందంబునందు లైంగ్యంబునఁ "దద్దాన
మణ్వపి చాక్షయం" బనెడుఁ గాన
నతిశయించునట్లు శ్రుతులు "తేనానంత"
యనుచు మ్రోయుఁ గాన నధముఁడైన
నతఁడు పూజ కర్హుఁ డతఁడు పాత్రుఁడు శివ
భక్తుఁ డతఁడు గాఁడె బసవలింగ! 76

అనయంబు నాయువ్యమునను సంభాషణ
ముత్తమం బనుచు సదుత్తరముగఁ
బొందుగ లైంగ్యంబునందు సంభాషణ
ముక్తి యటంచు సమ్మోదితముగ
సత్యంబు శివధర్మశాస్త్రంబునందు శై
వానంద మనుచును నతులితముగ
నొనర విష్ణుపురాణమున "సకృత్సంభాష
ణా దపి" యనుచు సంపాదితముగ
మ్రోయునట్టి వేదంబుల నాయతముగ
"తేన సహాసం వసే" త్తనుదాన భక్తి
పరులతో నాచరించు సంభాషణముల
ఫల మెటుఁగ నల్పులతరంబె బసవలింగ! 77

ప్రఖ్యాతిగా "శివభక్తస్య దర్శనం"
బనుచు శ్రీలైంగ్యంబునందు మ్రోయ
నవ్యంబుగా "దర్శనా దపి" యని శివ
ధర్మంబులెల్ల నుదాత్తత నన
నాదట "శివదర్శనా దపి తోషా" య
నియు భృగుసంహిత నెమ్మి మ్రోయ
నొనర విష్ణుపురాణమున "దర్శనా చ్ఛివ
భక్తస్య" యని ప్రీతిఁ బలుకునట్లు
పరగ శాస్త్రములను ప్రకటింప సద్భక్త
దర్శనంబు శంభుదర్శనంబు
గాన భక్తజనులఁ గన్నంత నగు మోక్ష
పదవి యొండ దేల బసవలింగ ! 78

తారకబ్రహ్మంబుఁ గోరి శ్రీకాశిలోఁ
జచ్చినఁగాని మోక్షంబు లేదు
యనురక్తిఁ గేదారమున నుదకముఁ ద్రావఁ
గలిగినఁగాని మోక్షంబు లేదు
"పాశమోక్షా" యనఁ బాశుపతవ్రత
గామికిఁగాని మోక్షంబు లేదు
శ్రీపర్వతంబున శిఖరాగ్రశృంగంబు
గాంచినఁగాని మోక్షంబు లేదు
మ్రొక్కఁగన్నఁ జాలు "ముక్తికిలేప్సితా"
యనఁగ భక్తవరులఁ గనినమాత్ర
శ్రుతులలోన నింతసులభ ముండఁగ మోక్ష
పదవి కించ యేల బసవలింగ ! 79

వ్యక్తంబుగా "శివభక్త మహాం వ్రజే"
త్తన శివధర్మంబునందు వ్రాయ
నచ్చెరు వంద "గృహం దేవమందిరం"
బనుచుం దత్సూక్తంబునందు వ్రాయ
సత్యంబుగాఁ "దత్రసన్నిహిత శ్శివ"
యని వాయవీయంబునందుఁ బల్క
భ్రాజితం బగుఁ "దత్రయోజనపర్యంత"
మని తత్పురాణంబునందుఁ దెల్ప
నట్లు రూపించి శ్రుతులు నిరంతరంబు
"తేన సహసం విశే" త్తనుఁ గాన భక్త
జనగృహాంగణముల కెన్న సరియె ధాత్రిఁ
బరగుచుండెడు క్షేత్రముల్ బసవలింగ ! 80

వ్యక్తంబుగా "శివభక్తా ననశ్యంతి"
యనుచు శ్రీస్కాందంబునందు వ్రాయఁ
దథ్యంబు గాఁగ "మద్భక్తా" ననశ్యంతి
యనుచు నా సౌరంబునందు వ్రాయఁ
బరమార్థముగను "మే భక్తా ననశ్యంతి"
యని శివధర్మంబునందు వ్రాయఁ
బనివడి "న క్షయం భవతి శ్రీలింగపూ
జా" త్తనుచును శైవసరణి వ్రాయ
నట్లు "మృత్యుక్షీయమామృతా" త్తనుచు శ్రుతులు
వ్రాయఁ గాన విష్ణు విరించి ముఖ్యసురలు
ప్రళయజన్మప్రయుక్తులు భక్తజనులు
ప్రళయజన్మనిర్ముక్తులు బసవలింగ ! 81

మహి యెల్ల నెఱుఁగంగ మత్స్యకేశ్వరు లంక
హరి మత్స్యరూపంబునందుఁ గొల్వ
మున్ను దాను సముద్రమునఁ గూర్మనాథుని
హరి కూర్మరూపంబునందుఁ గొల్వ
నొనర గంగాతీరమున వరాహేశ్వరు
హరి వరాహాంగంబునందుఁ గొల్వ
సేతువందున మఱి శ్రీలింగమూర్తిని
హరి రామజన్మంబునందుఁ గొల్వఁ
దవిలి యూర నూర శివమహాసల్లింగ
మూర్తి నాదివిష్ణుమూర్తి గొల్వ
యితరు లేలొకో మహేశ్వరుఁ గొలువక
భవనిమగ్ను లైరి బసవలింగ! 82

స్రష్ట దాఁ గౌమారసర్గబ్రహ్మకుఁ బుట్టి
శంభుఁ గొల్వఁడె బ్రహ్మచర్యవృత్తి
వృషలికి నుదయించి విషకంఠుఁ గొల్వఁడే
నారదుం డనఁ దపోధీరవృత్తి
నిల నరనారాయణులు నాఁగలింగరూ
పములఁ గొల్వరె కళాప్రౌఢి మెఱసి
కపిలుండు దా సాంఖ్యకర్తృత్వ మాశించి
వరతపోనిష్ఠఁ గొల్వండె శివుని
యిట్లు తా ధర విష్ణుండు పుట్టి కూర్మి
నెసఁగఁ గుల దైవ మనుచు భజించి మఱియు
మఱచి మదియించి రుద్రుచే మడియుటయును
భాగవత మిట్లు పల్కదే బసవలింగ! 83

అదితికి నవరజుం డనఁ బుట్టి యింద్రున
కనుజుండు గాఁడె వామనుఁ డనంగ
సత్యవతికిఁ బరాశరుఁ డనుమునికిని
వ్యాసుఁ డనన్ గొడు కయ్యెఁ గాదె
మేరుదేవికి నాభిమేదినీపతికిని
వృషుఁ డను జనుఁ డుద్భవించెఁ గాదె
యనసూయ యనుసతి కత్రియ న్మునికి ద
త్తాత్రేయుఁ డనఁ గొడు కయ్యెఁ గాదె
యిట్లు తా ధర విష్ణుండు పుట్టి కూర్మి
యెసఁగఁ గులదైవ మనుచు భజించి మఱియు
మఱచి మదియించి రుద్రుచే మడియుటయును
భాగవత మిట్లు పల్కదే బసవలింగ! 84

శర్వుఁ గొల్వఁడె యష్టషష్టితీర్థములందుఁ
బృథుఁ డనఁ బుట్టి యీ పృథివిమీఁద
మోహినీదేవికి మొదల ధన్వంతరి
నాఁ బుట్టి కొల్వఁడె నాగభూషు
నింద్రానుజుం డన నీశు భజింపఁడే
యసురాపహారణకార్యార్థమునను
కృష్ణుఁ డనఁగఁ బుట్టి కృష్ణేశుఁ గొల్వఁడే
శ్రీకాశియందు విశిష్టభక్తి
యిట్లు తా ధర విష్ణుండు పుట్టి కూర్మి
యెసఁగఁ గులదైవ మనుచు భజించి మఱియు
మఱచి మదియించి రుద్రుచే మడియుటయును
భాగవత మిట్లు పల్కదే బసవలింగ! 85

హరి దేవకికిఁ బుట్టె ననుపురాణము విం్రదు
హరి పుట్టె నీశున కనుట వినరు
హరి మ్రొక్కెఁ గొంతికి ననుపురాణము విం్రదు
హరి మ్రొక్కె నీశున కనుట వినరు
హరి బుద్ధపదవర్తి యనుపురాణము విం్రదు
హరి శైవపదవర్తి యనుట వినరు
హరి చచ్చె బోయచే ననుపురాణము విం్రదు
హరి చచ్చె శరభుచే ననుట వినరు
హరియుఁ గన్నిచ్చె నరునకు ననుట విం్రదు
హరియుఁ గన్నిచ్చె నీశున కనుట వినరు
జ్ఞానహీనులు మూర్ఖు లజ్ఞానరతులు
పాపమతు లెట్టిదుష్టులో బసవలింగ ! 86

హరి వీరశైవుఁ డన్నందుకు మఱియు గ
ర్భాధానఖండమే ప్రథమసాక్షి
హరి వీరశైవుఁ డన్నందుకుఁ దన నేత్ర
కమల మొసంగినక్రమము సాక్షి
హరి వీరశైవుఁ డన్నందుకు శంకరు
చేతఁ బొందిన శివగీత సాక్షి
హరి వీరశైవుఁ డన్నందుకు శ్రీసాంబుఁ
డనెడిపుత్త్రునిఁ బడసినదె సాక్షి
యిన్నిసాక్షులుఁ గాకయ పన్నగాను
ధ్యేయుఁ డని శంభుఁ బూజించుతెలివి సాక్షి
కాని సద్ధర్మములను నిక్కం బటంచుఁ
బలుక నొల్లరు కూళ లో బసవలింగ ! 87

ఆదిమూలం బైన యమృతంబుఁ ద్రచ్చుచో
ఫణివిషజ్వాలకుఁ బాఱనేల
పదునాల్గుభువనంబు లుదరంబులో నున్నఁ
బగతుఱచే బాధ పడఁగనేల
విశ్వమంతయుఁ దాన వేలుపై నెగడినఁ
గొడుకుఁ జంపఁగఁ జూచి కొఱలనేల
తా నగ్రదైవమై దనకర్మముల వాయ
శివప్రతిష్ఠలు పూని సేయనేల
యిట్టి వన్ని చదివి యిలఁ గమలాక్షుండె
దైవ మనుచు మిగులఁ దలఁచి తలఁచి
యభవు మఱచి కొంద ఱైహికాముష్మిక
భ్రష్టు లగు టదేమి బసవలింగ ! 88

తగిలి వరాహావతారంబుఁ జెప్పుదు
రది కార్తికేయుచే నణఁగె ననరు
నరసింహుఁ డుగ్రదానవుఁ జంపె నందురు
మఱి శరభేశునిమహిమ వినరు
వ్యాసుండు చే యెత్తె నని పల్కుచుందురు
కని నందికేశుండు తునిమె ననరు
ఘనుఁడు త్రివిక్రముఁ డనుమాటలే గాని
వీఁపు పెళ్ళున శూలి విఱిచె ననరు
ఏమి చెప్ప భక్తిహీనపౌరాణికు
లైన దుష్టమానవాధములను
జూడరాదు వారిఁ జూడ దోషము భక్తి
పరుల నంటు మిగుల బసవలింగ ! 89

గుడిగుడిఁ దప్పక వడిఁ గోలుపడగలై
క్రాలెడు వ్యాసునికరముఁ జూచి
వీరభద్రుని క్రొమోాల వినతుఁడై మేషంబు
తలఁ దాల్చియున్నట్టి దక్షుఁ జూచి
యేనాఁట నేయూర నేవీథి నేగుడి
హరుఁడు దాఁ బూజార్హుఁ డగుటఁ జూచి
యెల్లవారును జూడ నేఁటేఁట నూరూర
గ్రామోత్సవంబులక్రమముఁ జూచి
యిదియుఁ గాక "ఏక ఏవ రుద్రో" యంచుఁ
బల్కు శ్రుతులఁ జదివి వరగఁ జూచి
భవునిఁ గొల్వ కేల ప్రాకృతు లిటు పర
బ్రహ్మదూరులైరి బసవలింగ! 90

అఖిలంబు విష్ణుమయం బైన నడవులఁ
బడి యాలిఁ గోల్పోయి యడలనేల
మూల మింతకునైన వాలిసుగ్రీవు లే
ర్పఱుపంగ లేక దా భ్రమయనేల
పుడమియంతయు రెండె యడుగులు నగునేనిఁ
గడఁగి దా లంకకు నడువనేల
వనధియంతయు నమ్మ మొనకుఁ దే నేర్చినఁ
గపులు తోడుగ వార్ధిఁ గట్టనేల
యట్టు లెటేఁగి యెటేఁగి హరి దైవ మనుచును
సభలఁ గూర్చి మధ్యఁ జదివి చదివి
యభవు మఱచి కొంద ఱైహికాముష్మిక
భ్రష్టు లగు టదేమి బసవలింగ! 91

ఒండేమి విష్ణుని కుత్పత్తి గలుగుట
కును జయుదష్టమిదినము సాక్షి
శార్ఙ్గికి సంసారసంగతిదుస్థితి
సిద్ధమై యునికికి సీత సాక్షి
యచ్యుతునకుఁ గూలు టది తెల్ల మనుటకు
భువిఁ జరుం డనియెడుబోయ సాక్షి
హరి కిట్టిభవము లనంతంబు లగుటకు
మత్స్యకూర్మాదిజన్మములు సాక్షి.
యతఁడు శివునిశిష్యుఁ డగుటకు రామేశ్వ
రాదిసుప్రతిష్ఠ లవియె సాక్షి
యట్టివిష్ణువునకు నభవు నకుఁ బరా
త్పరునిఁ బోల్చ నగునె బసవలింగ ! 92

భృగునిశాపంబునఁ దగిలి జన్మించుట
పట్ట మప్పుడె దిశాపట్ట మగుట
నడవుల కేఁగుట జడలు ధరించుట
మారీచుమాయల మరులుకొనుట
యాలిఁ గోల్పోవుట వాలిఁ జంపుట తారఁ
దెచ్చి సుగ్రీవున కిచ్చుటయును
గోఁతులఁ దోడుగాఁ గూర్చుట బలమెల్లఁ
గడచినవారికిఁ గట్టువడుట
రావణుని వధించి బ్రహ్మహత్య హరింపఁ
గోరి రామనాథుఁ గొలుచుటయును
హరికిఁ బౌరుషములె యనియెల్ల శ్రేష్ఠంబె
వసుధఁ బుణ్యకథలె బసవలింగ ! 93

ఎన్న గృహాంతర్బహిర్వ్యాపకులలోన
నందఱుఁ గర్తలే యరసిచూడ
నెన్న గ్రామాంతర్బహిర్వ్యాపకులలోన
నందఱుఁ గర్తలే యరసిచూడ
నెన్న దేశాంతర్బహిర్వ్యాపకులలోన
నందఱుఁ గర్తలే యరసిచూడ
నెన్న లోకాంతర్బహిర్వ్యాపకులలోన
నందఱుఁ గర్తలే యరసిచూడ

నట్ల "వ్యాప్త నారాయణో" యనఁగ వ్యాప
కులకుఁ గలదె కర్తృత్వంబు గలదె హరికి
నెలమిఁ శ్రుతియు "జగత్పతయే" యనంగ
భర్గుఁడే జగత్పతి గాక బసవలింగ ! 94

కడఁగి "రుద్రాయ మఖఘ్నాయ" యన వీర
భద్రుఁడె పో మఱి రుద్రుఁ డనఁగఁ
గడఁగి "యింద్రాయ మఖఘ్నాయ" యన సాక్షి
యఁగు నింద్రు మఖహర్త యనఁగ నగునె
నలి "నగ్నయే మఖఘ్నాయ" యనంగ న
య్యగ్ని మఖాంతకుం డనఁగఁబడునె
వెలయ "నమో విష్ణవే" యన శైవపం
చాక్షరి భాగవతాదులందు

విష్ణుఁ గూర్చినయుక్తులు వినుతులు మఱి
యనుమతింపఁగ నవి శంకరునకుఁ గాదె
"ఓం నమో బ్రహ్మణే" యనుసూక్తములను
భర్గునకు మ్రొక్కె వేదముల్ బసవలింగ ! 95

ఖ్లీ యజుర్వేద "మాదిత్యవర్యం తమ
సః పరస్తా" త్తని చాటుచుండు
మఱి యుపనిషది "సమస్తసాక్షిం తమ
సః పరస్తా" త్తని చాటుచుండు
రహిని "దద్విష్ణోః పరం" బని లైంగ్యంబు
సౌరాదిసూక్తులు చాటుచుండు
నెఱయఁ దా నారాయణీయవాక్యము "తమ
సః పరస్తా" త్తని చాటుచుండుఁ
గాన "తమసః పరం" బనఁ గాంచుశబ్ద
మర్థ మదియు "విష్ణోః పరం" బనుచుఁ బొగడఁ
బరగ విష్ణునికంటెను బరమమైన
పదము శంభుండు చర్చింప బసవలింగ ! 96

కారణాగమమున "నారా నరో రుద్ర"
యనుట నారాయణుం డనఁగఁ బరగెఁ
బొదలి లైంగ్యమున "నాపూర్వతేభి" యనంగఁ
జనుట నారాయణుం డనఁగఁ బరగె
శ్రీస్కాందసూక్తులఁ జెలఁగి "ఆపో నరా"
యనఁగ నారాయణుం డనఁగఁ బరగె
నదియుఁ గాక "విపక్షి" యనఁగఁ దార్క్ష్యగతిఁ
జనఁ బక్షివాహనుం డనఁగఁ బరగె
"విష్ణు లుప్తా" యనంగను విష్ణువునకుఁ
బరశివ పరతత్త్వాదిక వ్యాపకత్వ
మున్నదే విష్ణునామాదు లెన్నిచూడఁ
బరమతత్త్వవాచక మెద్ది బసవలింగ ! 97

## ప్రకృతిపురుషనామములు

ఆది "సుమాసహాయం పరమేశ్వరం"
బనునట్లు వేదంబులందుఁ గలిగె
నట్టు "లుమాసహాయం పరమేశ్వరం"
బనుక్రియఁ గూర్మాదులందుఁ గలిగె
ధరఁ "బరమేశ్వరోంధకరిపు" రనుభాతి
నరయ నిఘంటువునందుఁ గలిగె
నిల "శంకరః పరమేశ్వరో" యనఁగ ని
మ్మాడ్కి సహస్రనామములఁ గలిగె
నిల మహేశ సర్వేశ విశ్వేశ ముఖ్య
మైననామముల్ పరమేశుఁ డనఁగఁ బరగు
నీశునకుఁ గాక యొండైన నితరసురల
కెసఁగ నున్నవే చూడంగ బసవలింగ ! 98

రూపింప నారాయణోపనిషత్తు "మ
హేశ్వరో" యనఁ గూఢ లెఱుఁగ రెట్లు
రూఢి వెలుంగ శ్రీరుద్రోపనిషది "వి
శ్వేశ్వరో" యనఁ గూఢ లెఱుఁగ రెట్లు
వర్ణనఁ దనరఁ గైవల్యోపనిషది "స
ర్వేశ్వరో" యనఁ గూఢ లెఱుఁగ రెట్లు
మానుగా నందు "సుమాసహాయః పర
మేశ్వరో" యనఁ గూఢ లెఱుఁగ రెట్లు
ఇల మహేశ సర్వేశ విశ్వేశ ముఖ్య
మైననామముల్ పరమేశుఁ డనఁగఁ బరగు
నీశునకుఁ గాక యొండైన నితరసురల
కెసఁగ నున్నవె శ్రుతులలో బసవలింగ ! 99

మొదల శ్రీఋగ్వేదమునఁ "బురుషం కృష్ణ
పింగళం" బనఁగను సాంగముగను
ఆ యజుర్వేదంబునందుఁ "దత్పురుషాయ
విద్మహే" యనఁగను విస్తరముగఁ
జను తదీయోపనిషత్సూక్తములఁ "బురు
ష కపిలవర్ణ సుశబ్దపూరు
షాఖ్యద నిర్ణయం" బనఁగ మూలంబుగా
సార "ముత్తమపురుషా" యనంగ
భవుఁడు పురుషుండు విష్ణుండు ప్రకృతి యట్టు
లగుటను నటు "విష్ణుర్యోని" యంచుఁ జెప్పు
శంకరుం డధిపతి యని చదివి చదివి
ప్రాకృతులు దీని నెఱుఁగరు బసవలింగ ! 100

"రామరూపరతాచ్ఛరధి" యనంగను స్కాంద
సరణి రాముండు దా శరధిఁ జొచ్చె
వెండియు రాముండు విష్ణుపురాణోక్తి
"విలయం గతో" యన విలయ మొందె
"వ్యక్తంచ మానుషం" బనఁగఁ గృష్ణపురాణ
మునఁ గాదె కృష్ణుండు ముక్తుఁ డయ్యెఁ
బాళి నొక్కఁడు "బలభద్రోపి సంత్యజే"
త్తనఁ గాదె బలభద్రుఁ డడవిఁ బడియె
బుద్ధుఁ డనువాఁడు వేదవిరుద్ధుఁ డయ్యెఁ
గలికి యనువాఁడు జగదపకారి యయ్యె
విష్ణునవతారముల్ గూడ విరళ మయ్యెఁ
బ్రమథవర్గంబుచేఁ గాదె బసవలింగ ! 101

ఈ వేదములోకంబు లిమ్ముగాఁ దనలోనఁ
దవి లిడుకొన్నట్టి దైవ మంద్రు
ప్రబలుఁడై తనసతి రావణుఁడు హరింప
నేలోకములనుండి యేఁగె చెప్రుమ
చక్రి కెన్నటికిని జావు పుట్టుక లేద
నాదిమూలం బంద్రు సాదరముగఁ
దవిలి యా పదియవతారముల్ తా నటు
పుట్టక చావక యెట్లు వచ్చె
భవుఁడె దైవ మనుచుఁ బాటించి యేప్రొద్దు
ధాటి మీఱ శ్రుతులు సాటిచెప్పఁ
బరగఁ జదివి చదివి ప్రాకృతు లేలొకో
భక్తిబాహ్యు లైరి బసవలింగ! 102

హరి యజ్ఞపురుషుండు హరుఁడు యజ్ఞేశ్వరుం
డనినవాక్యం బెఱ్గరయ్య నరులు
హరియు జగత్కర్త హరికి భవుఁడు కర్త
యనినవాక్యం బెఱ్గరయ్య నరులు
హరి విశ్వమయుఁడు శంకరుఁడు విశ్వాధికుం
డనినవాక్యం బెఱ్గరయ్య నరులు
హరి ప్రకృతి తదీయపురుషుండు శంకరుం
డనినవాక్యం బెఱ్గరయ్య నరులు
బుధులు నిర్వచింపఁ బోలుచుఁ "దద్విష్ణోః ప
రం" బనఁగను శ్రుతి శిరఃప్రసూక్తి
విన రదేమొ శివుఁడు విష్ణుసికన్నను
బరమపద మనంగ బసవలింగ! 103

ధరలోన విష్ణువే దైవ మటంచును
జెప్పిన వేదంబు లొప్పు కెట్లు
చనునె అంకాడ "యోషాచార" యనుచు వే
దంబులు చెప్పినఁ దప్పు గాదె
సుర ద్రావఁ గూడునే శ్రుతి సురాపానము
నొప్పిన నది మఱి తప్పు గాదె
పశుపతి రుద్రుండు "పశుమా లభే" త్తన
నరయంగ మఱియుఁ ద ప్పగును గాదె

యట్ల విష్ణ్వాదులను శ్రుతులందుఁ జెప్పె
హరికి దాసుండు వ్యాసుఁ డటంద్రు గిరిజ
పతికి దాసుం డటంచును బల్కు రేమి
భర్గమహిమంబుఁ దెలియరు బసవలింగ! 104

నందికేశుఁడు చేయి నాచికొన్నను విష్ణుఁ
బాసి వ్యాసుఁడు శివదాసి గాఁడె
క్షువుఁడు దధీచిచేఁ గూలఁగా సరసిజాం
బకుని విడిచి భర్గుబంటు గాఁడె
భామలఁ గోల్పోయి పర్వతనారదుల్
హరి నొల్ల కీశుకింకరులు గారె
శ్రీవాసుదేవుండు గోవిందు విడిచి యా
ఖండేందుధరునిభక్తుండు గాఁడె

ధరను వీరు శివునిదాసులై కేశవు
విడిచి శైవు లైరి వివిధగతులఁ
గాన శివుఁడె యాదికర్త యాటకు వేఱె
ప్రత్యయంబు లేల బసవలింగ! 105

వ్యాసుండు హరి కర్త యన నటు త్రెళ్ళుట
విష్ణువాదులు వాని విడువవలదె
తానె బ్రహ్మన బ్రహ్మతలను బోఁ జిదిమిన
బ్రహ్మవాదులు నెడఁబాపవలదె
యద్వైతమతి నుష్ట్రి మయ్యెను మునికుమా
రుం డని యది యొల్లకుండవలదె
కర్మంబు నూఁది లింగము గోలుపడ్డ భ
ట్టాచార్యమతముఁ గాదనఁగవలదె
తొల్లి శివుని విడిచి దుర్మార్గవర్తులై
యెనసి చెడ్డవారి నెఱిఁగి యెఱిఁగి
యున్నవారుఁ జెఱుట యుక్తియే యీశ్వర
భక్తి నాత్మ లేక బసవలింగ ! 106

బోధాయనస్మృతి "నాధి కుర్వంతి త
ద్గంగా" యనంగ నెఱుంగ రెట్టు
లజ్ఞాను లెఱుఁగక యం "దయోనిప్ర" నాఁ
జనుశ్రుతి యెన్నఁడు చదువ రెట్లు
నలి గౌతమస్మృతి యలరి "భిన్నాంకయే"
త్తనెడివాక్యంబులు వినరె యట్లు
యిల "నాంకయే న్నదహే ద్విప్ర" యనుచు య
మస్మృతి యనునది మఱచి రెట్లు
ఆదిరూపంబులందు దూష్యంబులైన
శంఖచక్రాదిలాంఛనసమితిఁ దాల్చు
వారిమాటలు నమ్మి శ్రీవామదేవు
భక్తి మఱచి నటెంతురు బసవలింగ ! 107

విష్ణుభక్తులు శివభక్తు లగుటకుఁ గారణము
ఏర్పడ సూతసంహిత "నకుర్యా న్న చ
ధారయే" త్తనఁగ "నధార్య" మనఁగ
మును వామనపురాణమునను "దేహే న చ
ధారణం" బనఁగ "నధార్య" మనఁగ
ఆ పరాశరసూక్తు లటు "నదహేచ్ఛంఖ
పూర్వకై" యనఁ దప్పు పొందు ననఁగ
యజ్ఞవైభవమున "నాభి కాది నచలాం
ఛిత" యన దుర్గతిఁ జెందు ననఁగ
శంఖచక్రాదిలాంఛనసమితిఁ దాల్చు
నట్టివారలతో మాట లాడఁదగదు
శ్రుతు లిటుల "అర్ధచంద్రం చ శూల" మనఁగఁ
బ్రాకృతులు దీని నెఱుఁగరు బసవలింగ ! 108

స్కాందసూక్తులఁ "జిదాకారేణ శస్త్రేణ
భిద్యతే" యన నివి పెట్టఁదగునె
ధరియింతురే పరాశరపురాణము "మను
ష్యః పాపకర్మిణ" యనఁగఁ గ్రమము
లలి "నూర్ధ్వకం వర్తులం చార్థసార్థకం"
బనుచు శాంభవమార్గ మలరి మ్రోయ
నొగి సూతసంహిత "నోర్ధ్వపుండ్రం చ ల
లాటే" యనంగఁ దాల్పంగఁదగునె
ఆదిమునులచే దూష్యంబు లైన యూర్ధ్వ
పుండ్రములు దాల్చు నపగతపుణ్యరతుల
నైహికాముష్మికవిరహితార్థమతులఁ
బ్రాకృతులఁ గాంచఁ బోలునే బసవలింగ ! 109

ఆది వేశ్యాపుత్రుఁ డయ్యె వసిష్ఠుండు
శివభక్తిచేత విశిష్టుఁ డయ్యె
బోయెతకడుపునఁ బుట్టినవ్యాసుండు
శివభక్తిచేత విశిష్టుఁ డయ్యె
వ్యాధుఁడై యుండియు వాల్మీకుఁ డనుముని
శివభక్తిచేత విశిష్టుఁ డయ్యె
నజ్ఞుఁడౌ మాతంగుఁ డనెడుచండాలుండు
శివభక్తిచేత విశిష్టుఁ డయ్యె
మఱి యధమయోనుల న్బట్టి మహిమ నెగడి
పూర్వములు వీడి జగమునఁ బూజ్యులైరి
శ్రీమహాదేవుకరుణచే శ్రేష్ఠు లగుచు
బ్రాహ్మణోత్తము లైరి యో బసవలింగ! 110

తగ "దురితక్షయార్థం పరమేశ్వర
ప్రీత్యర్థ" మని యాచరింపఁ బ్రణవ
రతి "దురితక్షయార్థం పరమేశ్వర
ప్రీత్యర్థ" మని యెల్లక్రియలు నడువఁ
బ్రతి "దురితక్షయార్థం పరమేశ్వర
ప్రీత్యర్థ" మని సంధ్యఁ బ్రీతి సేయఁ
దగ "దురితక్షయార్థం పరమేశ్వర
ప్రీత్యర్థ" మని హవిఁ బ్రీతిఁ బెట్ట
దానఁ బ్రీతుఁడై యట్ల తత్కర్మఫలము
లిచ్చు శ్రీశంకరుం డుండ నితరసురలఁ
గొలుతు రేలొకో భవవార్ధిఁ గూలఁదలఁచి
ప్రాకృతాధము లెల్లను బసవలింగ! 111

ఘనశ్రుతి "పరమలింగాయ నమో" యనఁ
"బరమలింగం" బన హరుఁడు గాఁడె
పరికింపఁగా "నమః పరమాత్మనే" యనఁ
"బరమాత్ముఁ" డనఁగ నా హరుఁడు గాఁడె
చర్చింపఁగా "ఋతం సత్యం పరబ్రహ్మ"
యనఁ "బరబ్రహ్మంబు" హరుఁడు గాఁడె
యట్ల "ఉమాసహాయః పరమేశ్వర"
యనఁ "బరమేశుండు" హరుఁడు గాఁడె
తివిరి పరశివలింగమూర్తికిని గాదె
మొదలఁ బరశబ్ద ముత్కృష్టపదము గాన
యిట్టి పరమేశనామ ముపేంద్రముఖ్య
భవనిమగ్నుల కున్నదే బసవలింగ ! 112

ఉపనయనాది "రుద్రోపదిష్టము నాభ్యు
దేకం పిబ" వ్యక్త మెనఁగఁ జేసి
శ్రీనందికేశ్వరప్రీత్యర్థ మని నంది
ముఖమున నిష్టార్థమును విధించి
యా ప్రణవాదిగాయత్రిప్రదానంబు
శివు భర్గు ప్రార్థనఁ జేసి పడసి
అగ్నిహోత్రాదుల నగు "భూతిమేదావి"
యనుచు సర్వాంగంబులందుఁ దాల్చి
రుద్రవేష్టి యా సత్క్రియారూఢి శూద్ర
జన్మనిర్వృత్తిఁ బొందిద్విజన్మ మంది
వేదవిదుఁ డౌట బ్రహ్మ సద్విధిఁ జరించె
బ్రాహ్మణుం డౌటకే గదా బసవలింగ ! 113

ఓంకార మను బీజ ముత్పత్తియై మఱి
యెవ్వని తేజమం దిమిడియుండె
వెస నజాండము లెల్ల విషవహ్ని నెరియునాఁ
డెవ్వనిమాహాత్మ్య మెఱుఁగవచ్చె
వీరభద్రుఁడు దక్షుఁ జేరి చంపిన నెవ్వఁ
డడ్డమై తప్పించి యతనిఁ గాచెఁ
దానె బ్రహ్మన బ్రహ్మతలఁ ద్రుంచివైచిన
మీఁటి నాఁ డెవ్వండు మెలఁగఁగలిగె
ఆదికారణుఁ డవ్యయుం డార్తవరదుఁ
డభిమతార్థప్రదాయకుం డప్రమేయుఁ
డాగమాతీతుఁ డైనట్టి హరుని నెఱిఁగి
వసుధ శివు నమ్మ రేలొకో బసవలింగ! 114

తప్పక నిత్యంబు "తత్సవితుర్వరే
ణ్య" మని ప్రాణాయామ మాచరించి
తప్పక నిత్యంబు "తత్సవితుర్వరే
ణ్య" మని ముమ్మాఱు దా నర్ఘ్య మెత్తి
తప్పక నిత్యంబు "తత్సవితుర్వరే
ణ్య" మని గాయత్రనయంబుఁ జెప్పి
తప్పక నిత్యంబు "తత్సవితుర్వరే
ణ్య" మనుచు హవ్యకవ్యములు వెట్టి
ప్రణవమూర్తి భర్గుఁ బరితృప్తిఁ జేసి త
త్ఫలము నీశుచేతఁ బడసి యితర
సురలఁ గొల్వ భక్తి సుస్థిరంబై క్రియా
ఫలము సఫల మగునె బసవలింగ! 115

## అశుచినిరసనము

ఆదిని విశ్వదేవార్పితాన్నమునందుఁ
ప్రాణాహుతులు పెట్టఁబడునెయేని
ఆపితామహరుద్రరూపార్పితాన్నంబు
ప్రాణాహుతులు పెట్టఁబడునెయేని
భవ్యమహాదిత్యభావార్పితాన్నంబు
ప్రాణాహుతులు పెట్టఁబడునెయేని
బ్రహ్మార్పణం బైన పరమామృతాన్నంబు
ప్రాణాహుతులు పెట్టఁబడునెయేని
అట్ల విష్ణ్వర్పితాన్నంబు లగునయేని
శివప్రసాద మెటులు దా నిషేధ మయ్యెఁ
దవిలి "హరభుక్తశేషం దదాతి" యనఁగ
బ్రాహ్మణు లెఱుంగ రేమొకో బసవలింగ ! 116

శ్రుతిరత్న మైన యజుర్వేదసూక్తంబు
పలుమాఱు "నో మితి బ్రహ్మ" మనఁగ
నేపార నారాయణోపనిషత్తు "స
బ్రహ్మపదాప్నోతి పరమ" మనఁగ
నెఱయంగ లైంగ్యోపనిషదియందును "నమృ
తం బ్రహ్మయోనిం తథా" యనంగ
వెలయ నథర్వణవేదసూక్తియును "ప
శ్యంతి సూరయో" నాఁగ సాంగమైన
స్కాంద పారాశ రాదిత్య సౌర లైంగ్య
కూర్మ బ్రహ్మపురాణసంకులమునందు
రుద్రసాకారసిద్ధాంతరూపణంబు
బ్రహ్మ మని చెప్పఁబడుఁ గాదె బసవలింగ ! 117

విశ్రుతంబుగ యజుర్వేదంబు "రూపమి
వాస్య" యనుచు నిశ్చయంబు పలుక
వినుతింప "రూపతత్త్వే తథా సేవాం చ
హో చ యే" త్రనఁగ హంసోపనిషది
నెఱయంగఁ దత్త్వోపనిషది దా "సోహ మా
త్మా" యటంచును మనమారఁ బొగడ
తథ్యంబు సూతగీతయు ధర "కారుణ్య
వన్మూర్తి" యనుచుఁ గేవలము చదువ
మఱియు మానవాద్యఖిలనిర్మలపురాణ
ములును సర్వోపనిషదర్థములును జేర్చి
మంగళజ్యోతిరాకారలింగమూర్తి
భజనమే బ్రహ్మ మని చెప్పు బసవలింగ! 118

మున్ను యజుర్వేదమున "ఋతం సత్యం ప
రబ్రహ్మ" యనఁ బరబ్రహ్మ శివుఁడు
రమణ నథర్వశిరస్సూక్తి "తత్పరం
బ్రహ్మేతి" యనఁ బరబ్రహ్మ శివుఁడు
చాటు బ్రహ్మోపనిషత్తు "నతత్పరం
బ్రహ్మేతి" యనఁ బరబ్రహ్మ శివుఁడు
అదియును "నద్వితీయం పరమాత్మ త
ద్బ్రహ్మేతి" యనఁ బరబ్రహ్మ శివుఁడు
"ఏక ఏవ రుద్రో" యన నేక మగుట
నియతిఁ దలపోయ లేకయే నిఖిలమైన
వేల్పులను గొల్చి చెడుదురు వివిధగతుల
బ్రహ్మ శివుఁ డని తెలియరు బసవలింగ! 119

అసమపరాశరీయంబున "బ్రాహ్మణో
భగవా" నన శివుఁడు బ్రాహ్మణుండు
తప్పక యా "క్షత్రియః పరమో హరి"
యనఁగను క్షత్రియుం డచ్యుతుండు
విస్తరింపఁ "బితామహస్తు వైశ్యశ్చ" నా
నొనరంగ ధరను వైశ్యుండు బ్రహ్మ
లక్షింపఁగా "వృషలస్తు పురందరో"
యనఁగ శూద్రుండు దా నమరవిభుఁడు

యట్ల సామంబు "బ్రాహ్మణోస్మ్యహా" మనంగ
శివుఁడు శ్రేష్ఠుండు హరి విరించియును హరియు
నట్లు క్షత్రియ వైశ్య శూద్రాదు లనఁగ
భర్గసము గాదు రే వీరు బసవలింగ ! 120

శ్రుతియట్ల సూతసంహిత "పరబ్రహ్మ శాం
భవ" మటంచును శివుఁ బ్రస్తుతింప
రమణ మానవపురాణము "ఋతం సత్యం ప
రబ్రహ్మ" యనుచుఁ గీర్తనలు సేయ
నిల "సత్పరబ్రహ్మ ఈశాన" యనుచు నా
దిత్యపురాణంబు దివిరి పొగడ
రహి "ఏక మేవ పరబ్రహ్మ" యనుచును
గూర్మపురాణంబు గూర్మిఁ బలుకఁ

గాఁ బరబ్రహ్మ యని నిరాకారపదము
రుద్రసాకారసిద్ధాంతరూపణంబు
బ్రహ్మ యగు రుద్రు భజియించుభక్తపరుని
బ్రహ్మవేత్తను శ్రుతి యెందు బసవలింగ ! 121

పరగ దధీచిశాపము "తమసా విష్ణు
తేజసా" యనియెడుఁ దేజ మలర
మును గౌతమునిశాపమున "భగవన్ వేద
బాహ్యాస్త్వ" మని యశుభంబు గాఁగ
మునుకొని భృగుశాపమున వేదమత మిటు
లీనం బటంచును లెస్స గాఁగ
మున్ను వ్యాసునిశాపమున "నరకాస్తే న
సంశయో" యనియెడుసరణి గాఁగ

నట్లు శాప మంది యవనిలోఁ బలుదేవ
తలను గొల్చి మిగులఁ దత్తఱపడి
శంభుభక్తి లేక శైవుల మనుచును
బల్కఁ దగునె చూడ బసవలింగ ! 122

పద్మభవుఁడు మున్ను "పాదరజస్స్పర్శ"
యని కాశికాఖండమున నుతింప
విధి "శుకవత్త్వ విశ్వేశ" యని శర
భాధ్యాయమును మనంబారఁ బొగడ
నలి శివయోగి "శ్రీనైవాశ్చ" యనుచు సూ
ర్యపురాణమునను బల్ ప్రణుతి సేయ
నొనర వాయుపురాణమున "దేవదేవాయ
బ్రహ్మణే" యని నల్వ ప్రస్తుతింపఁ

బాటివేదములను బ్రహ్మాధిపతి యని
చాటుశ్రుతుల నజుఁడు సన్నుతింప
భవునిఁ గొలువ కేల ప్రాకృతు లా పర
బ్రహ్మదూరు లైరి బసవలింగ ! 123

ఒక్కఁడు పుట్టించునో జీవరాసుల
నొక్కనియందుఁ దా నుదయ మగునొ
యొక్కండు చంపంగ నొక్కఁడు సేయునో
యొక్కండు జీవంబు లోలి నిడునొ
కాయంబు జీవుండు గదియునో జీవుండు
కాయంబు లొందునో గలిసి యగునొ
కాయంబు లాదియో కర్మంబు లాదియో
కాయకర్మంబు లొక్కటనె యగునొ

యనెడుధర్మ మిట్టు లొనర "సోమః పవ
తే" యటంచు సూక్తి ద్రోయుచుండుఁ
గాన శివుఁడె యాదికర్త యాటకు వేఱ
ప్రత్యయంబు లేల బసవలింగ! 124

రాజసగుణమునఁ బ్రబలి "భవాయ న
మో" యనఁ బుట్టించు మొదటికర్త
సాత్త్వికగుణమునఁ జాలి "మృడాయ న
మో" యన రక్షించు మొదటికర్త
తామసగుణమునఁ దగిలి "హరాయ న
మో" యన హరియించు మొదటికర్త
త్రిగుణంబులను బాసి నెగడి "శివాయ న
మో" యన సుఖియించు మొదటికర్త

యాది నొక్కరుఁడు మహాదేవుఁ డనఁగను
ద్రోయునట్టి వేదములు దొడంగి
చదివి చదివి దుష్టజను లెట్లు మఱచి స
ద్భక్తిరహితు లైరి బసవలింగ! 125

ఈక్షింప శ్రుతులు "సంరక్షితాం సృష్టించ
జయ" యన నచ్చైకశాసనముగఁ
జనుచుండు మఱి "సురక్ష్యతరాంశ్చ లోకాంశ్చ
లోకపాలాంశ్చ" నాఁ బ్రాకటముగఁ
దవిలి "యథాదేవతా స్సృష్టి" యనఁ "బళ
వోభి" యనంగను శోభితముగ
మును "పశవః సృష్టి" యనఁగ "బ్రహ్మాదయః
పశవో" యనంగ నపారితముగ

నట్ల "యున్మేషనిమిషచయ" మన ధరను
భవుఁడు గను దెఱవంగ నుత్పత్తి యగుట
హరుఁడు గన్మూయఁ జెడెడుబ్రహ్మాండకోట్లు
బ్రహ్మవిష్ణ్వాదిదేవతుల్ బసవలింగ ! 126

ఉత్తరం బెద్ది పూర్వోత్తరమీమాంస
లవియు నన్యోన్యదూష్యములు పూర్వ
మీమాంసమునను "గిల్మిషే గురుండు" నా
నాయతం బగు నంద యట్లగాక
పూర్వమీమాంసయుఁ బొరి భాస్కరీయంబు
నొసరెడు దా సాంఖ్యయోగములును
మదియించు నుదయమీమాంసప్రయుక్తిని
నుదయించు మీమాంసయుక్తిఁ దుడఁచి

కవులు మునులు వైదికంబులు సూత్రప్ర
దాత శూలి బహుమతంబు లవియు
నిదియుఁ దలఁపఁ దథ్య మీశ్వరుం డొక్కఁడే
బ్రహ్మ మనఁగఁ జెల్లు బసవలింగ ! 127

స్వేచ్ఛాప్రచారంబు ప్రచ్ఛన్నబౌద్ధంబు
హాస్యైకహేతు వన్యాయసరణి
అజ్ఞానతరము మహాజనదూష్యంబు
పాతకావాస మప్రస్తుతంబు
సత్క్రియాహీనంబు సర్వప్రమాణదూ
ష్యంబు నా లోకాయతంబు నెలవు
విద్వన్విముఖము నాత్మాద్వైత మట్టి మా
యావాద మైన వేదాంతమార్గ
ముత్తమాశ్రమ మే యసద్వృత్తి నాస్తి
కులును యుక్తిదూరులును గైకొంద్రుగాక
వేదవిహితశివాచారయుక్తి నడుచు
భక్తిపరులును గైకొంద్రె బసవలింగ ! 128

జైమినికృతపూర్వమీమాంసకులు నుచి
తార్థంబు తా దైవ మని తలంచి
కర్త లేఁ డని కర్త కర్మంబ యని "స్వర్గ
కామో యజే" త్తని కర్మకాండ
భాట్టశాస్త్రం బను భాష్యంబు సేయ భ
ట్టాచార్యలింగ మి ట్లంతరింపఁ
బారి మహిమ్నమున "ముఖరయతి మోహాయ
జగతా" మనుచు ధర్మశాస్త్రమతము
దొడరుఁ దాను కాన దూష్యంబు లగుచును
మేలు గాని వాని నేల చెప్పఁ
గాక మున్ను వేఱె కర్మవాదం బట్ల
పడయఁగలరె ముక్తి బసవలింగ ! 129

ధర "నవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ
యోగం" బటంచును నొగిఁ దనర్చి
యిలను దా నొక "జ్ఞాన మేవ మోక్షు" యనియు
నతిముతి భక్తి హాస్యంబుఁ జేసి
యది గాన "కాత్మాహ మిద మగ్రసే" త్తను
ధ్యానయోగంబు నుదాత్తపటిచి
తగ "నచపూజ్యో యథాహం" బనెడి భక్తి
యోగంబు ముక్తికి బాగు గాఁగ
భర్గు ననయంబుఁ బూజించుభక్తు లొల్ల
రానిధర్మంబులును గొన్ని పూని సల్పి
జగతిఁ జను భట్టవేదాంతసాంఖ్యములును
వసుధలో దూష్యములు గావె బసవలింగ ! 130

అక్రమాభ్యాసయోగక్రియారంభంబు
సతమైన లింగావసక్తి కెనయె
కమలపట్క ధ్యానగౌణమార్గము ముఖ్య
లింగావధానసల్లీల కెనయె
కల్పితానంతరకాలానుభవరతి
శివప్రసాదామృతసేవ కెనయె
సహజకేవలనిజస్పర్శనాకర్ణంబు
శివకథామృతరససిద్ధి కెనయె
తనదుప్రాణంబు బ్రహ్మరంధ్రమున విడుచు
నదియు ముఖ్యలింగైక్యసౌఖ్యమున కెనయె
హస్తిమశకాంతరము గాదె యుభయపాద
భక్తికిని యోగయుక్తికి బసవలింగ ! 131

తనువ యిహాబద్ధమున నిర్మలం బైన
వాంఛ భాతికచిహ్నా వాయువలదె
యుతమహాముద్రానుగతయోగమతిఁ దన్ను
మఱచిన గుణములు మఱవవలదె
ముద్రితఖేచరీముద్రాంతమున నమృ
తంబు గల్గిన మరణంబు గలదె
కోమలం బాజ్యోతికుంభమధ్యాంతర
మునఁ దోఁపఁ దద్రూపముక్తి గలదె
మొదల యోగము నిత్యత్వమునకు విహిత
మయ్యె నేనియు మును సనకాదిమునులు
యోగసిద్ధిని నిత్యులై యుండి రెట్లు
భక్తినిష్ఠులపగిదిని బసవలింగ ! 132

గతి "లింగమధ్యే జగత్సర్వ" మను మధ్య
కలితాంబరము మహాకాశ మనుచుఁ
బూని "యణోరణీయా" ననఁ జైతన్య
తత్త్వంబ యధ్యాత్మతత్త్వ మనుచు
రతి "లింగబాహ్యే త్పరం నాస్తి" యనఁ బాహ్య
శూన్యంబ యదియ తా శూన్య మనుచు
నెఱయంగ "బ్రహ్మేతి నిశ్చితం" బన లింగ
భావంబ యది పరబ్రహ్మ మనుచు
రూఢిగా "నేక ఏవ రుద్రో" యటంచు
భోగిభూషణు సద్భక్తి యోగనిరతి
నార్యు లర్చింతు రెడపక యతులమహిమఁ
బ్రణుతి సేయును శ్రుతులును బసవలింగ ! 133

ధాత తా "నహ" మని తలఁ గోలుపోవఁడే
రుద్రపశుపతి బ్రహ్మరూపుఁ గొనఁడె
శివదూషణముఁ జేసి చెడిరి కొందఱు ఋషుల్
గడు శ్రేష్ఠుఁ డాయె మార్కండమౌని
క్రొవ్వి సనత్కుమారుండు నుష్ట్రింబయ్యె
లింగైక్యనిష్ఠచే భృంగి వెలసె
సనకాదిమునులు బుద్ధిని వికలత నొంద
సిద్ధరాముఁడు శైవసిద్ధిఁ బొందె
వనజజునికంటె మునులకంటెను సనత్కు
మారుకంటెను యోగసమాధికులను
నధికు లున్నారె యోగక్రియాతిశయత
భక్తి మాలి తూలిరి గాక బసవలింగ ! 134

ఇల యోగమర్యాద లెఱిఁగినంతనె కదు
నీశుతత్త్వంబు వహించ నౌనె
కలిత మభ్యాసయోగక్రియామాత్రచేఁ
గాలవంచనశక్తి గలుగు నెట్లు
తవిలి జపసమాధితర్పణమాత్ర స
చ్చరితార్థసంపద లెఱుఁగ నౌనె
రతి రాజయోగకర్మజ్ఞానమాత్రన
యజరామరత్వ మింపార నౌనె
శంకరాచార్య భాస్కరాచార్య ముఖ్యు
లత్రి శక్తి గౌతమ కపిలాదు లైన
పూర్వఋషు లెల్ల సంసిద్ధిఁ బొందినారె
భక్తిసత్క్రియాపరులట్లు బసవలింగ ! 135

యోగ మజ్ఞానసమున్నతబీజంబు
యోగంబు దుర్వృత్తిసాగరంబు
యోగ మద్వైతదురుక్తులనిలయంబు
యోగ మహంకృతి కునికిపట్టు
యోగంబు ముక్తివియోగైకహేతువు
యోగంబు హానిప్రయుక్తశక్తి
యోగంబు దురితసంయోగైకకార్యంబు
యోగంబు విభ్రాంతియోగవృత్తి

యోగ మెట్లన్న శివునిభక్త్యోపయోగ
కారణంబై చెలంగు సాకారమూర్తు
లాదిగా లింగమూర్తి సహర్నిశంబు
ప్రణుతి సేయుచుఁ గొల్వరే బసవలింగ! 136

సరి "శివరూపసూత్స్మాంతరపర" మను
నది శివరూపత్రయంబునందు
రతి "న సుధామతే రధ్వర" స్యనఁ గాంతు
రాస్థూలతత్త్వ మజాదిసురులు
ఒనర యోగులు "సూక్ష్మయోగిభి" రనఁ గాంతు
రాసూక్ష్మతత్త్వ మష్టాంగనియతి
యర్థిఁ "దా మకృతస్య" యనఁగ భక్తులును ద
త్పరమలింగంబురూపంబుఁ గొలుతు

రట్లు "దృశ్యశ్చ నా న్యథా" యనఁగ మఱియు
నట్ల "భక్తిమానవ వేద్య" మనఁగ మఱియు
యోగులైనను లింగాంగయోగసరస
పదవి గానంగ శక్యమే బసవలింగ! 137

మహి "నిజవర్ణ సమాధిభిరన్య" య
నంగ భక్తికి సమానంబు గలదె
"యోగప్రవృత్తాంత యోగే నతుపరః" య
నంగ భక్తికి సమానంబు గలదె
మఱి "నతవర్ణ సమాధిభిరన్య" య
నంగ భక్తికి సమానంబు గలదె
నలిని "మంత్రా ధ్యయనై శ్చనతుశివా" య
నంగ భక్తికి సమానంబు గలదె
జపములును దపములు యోగసాధనములు
మంత్రతంత్రాదినియమసమాధివిధులు
ధ్యానములు సాంఖ్యయోగనిదానములును
వసుధ శివపూజ కెన యౌనె బసవలింగ! 138

శుద్ధలింగార్చనోత్సుకలీలఁ గాక య
భ్యాసయోగములఁ బాపములు చెడునె
లింగావధానకల్పితమనోరతిఁ గాక
ధ్యాన మార్గము శివుఁ గాన నగునె
ప్రాణలింగైక్యసంబంధసంగతిఁ గాక
వాయుధారణ ముక్త్యుపాయ మగునె
ధృతిఁ బశుపాశుపతిజ్ఞానమునఁ గాక
యద్వైతవిధులు నిత్యత్వ మగునె
నియమితాచారసద్భక్తినిష్ఠఁ గాక
భ్రాంతియోగంబులను ముక్తి భవ్య మగునె
లింగనిష్ఠాగరిష్ఠవిలీనవృత్తి
కెనఁగ సమ మౌనె యోగంబు బసవలింగ! 139

శివుఁడు నిస్సంసారి జీవుండు సంసారి
తజ్జీవునకు శివత్వంబు గలదె
శివుఁడు నిర్మలదేహి జీవుండు మలదేహి
తజ్జీవునకు శివత్వంబు గలదె
శివుఁడు దా నిష్కర్మి జీవుండు దుష్కర్మి
తజ్జీవునకు శివత్వంబు గలదె
శివుఁడు దా నిత్యుండు జీవుం డనిత్యుండు
తజ్జీవునకు శివత్వంబు గలదె
యరసిచూడఁ బర్వతపరమాణుమాత్ర
తరమునకు నంబరంబును ధరణికైన
యంతరంబులు గలుగు జీవాత్మ కెట్లు
పొసఁగుఁ బరమాత్మయోగంబు బసవలింగ ! 140

ఒడయుల నల్లంతఁ బొడగని కడఁగంటఁ
జూచునే కన్నారఁ జూచుఁగాక
యుచితక్రియాదుల కోర్వక వెనుకకు
వీఁగునే రతి నెదు రేఁగుఁగాక
కులమద ధనమద బలమదాదులఁ బేర్మి
నిక్కునే చాగిలి మ్రొక్కుఁగాక
యడిగినభావదేహార్థంబు లెడల వం
చించునే కూడ నర్పించుఁగాక

యాడునే వందనముఁ గొనియాడుఁగాక
నడుపునే నేర్పు ప్రీతియే నడుపుఁగాక
తుడుచునే క్రియ భక్తిమై నడుచుఁగాక
పరమభక్తిప్రశస్తుండు బసవలింగ ! 141

దర్పితవిధిఁ గ్రియాద్వైతవంచనమును
బొందునే శివపూజఁ జెందుఁ గాక
సతతతదీయపూజాపుణ్యఫలము లా
శించునే మరి నియమించుఁగాక
కృతఫలాన్యాయానుగత మగుభక్తికిఁ
బాఱునే భక్తి నేపారుఁగాక
వీరభక్తిస్థలాచారవిధముఁ బొల్లు
వఱుపునే భక్తియే నెఱుపుఁగాక
జీవితము శైవవృత్తికిఁ జిక్కుఁగాక
బొంకునే యెప్డు రెండాడఁ గొంకుఁగాక
వదలునే శైవక్రియలచేఁ బొదలుఁగాక
పరమభక్తిప్రశస్తుండు బసవలింగ ! 142

మొదల హరుం డని పిదప నరుం డని
చూచినఁ గల్గునే శుద్ధభక్తి
మొదలఁ జాగిలి మ్రొక్కి పిదపఁ జాగిలి నిక్కి
మలసినఁ గల్గునే మహితభక్తి
మొదల సద్గురుఁ డని పిదప దుష్కరుఁ డని
పల్కినఁ గల్గునే భక్తియుక్తి
మొదల శిష్టుం డని తుది నికృష్టుం డని
భావింపఁ గల్గునే పరమభక్తి
మొదల దానినై దీనత్వమునఁ జరింపఁ
గల్గునే త్రిలోకైకవిఖ్యాతభక్తి
మొదల దాసినై సోహత్వమునఁ జరింప
నసమసద్భక్తి గల్గునే బసవలింగ ! 143

మాట నిశ్చయమును మనసునఁ గృచ్ఛయుఁ
గలిగినఁ గలుగునే కలితభక్తి
మాటల వెఱపును మనసున నేర్పును
నెఱపిన నెఱయునే నియతభక్తి
మాటల వివరము మనసున వైరము
బరగినఁ గల్గునే పరమభక్తి
మాటల వలపును మనసున సొలపును
బొలసినఁ గలుగునే లలితభక్తి
మాటలందుఁ బొందు మనసునఁ గుందును
మాటలందు రసము మనసు గడుసు
మాటలందు దృఢము మనమున శఠమును
నెసఁగుచుండ ఫలమె బసవలింగ ! 144

కార్యంబు లేమిని గల్పించుకొన కవ
సరము గా దనక యుత్సవము చెడక
క్రోధు సేయక చూచు చూపు దప్పక రేపు
మా పన కంతలో మఱుగు వడక
లేమిఁ జూపకయు దాలిమిని దా నుండక
యొఱపులఁ బోవక కఱకుఁ బడక
విధము దప్పక యసద్వృత్తిని బలుకక
నేరమిఁ జూపక నెనరు విడక
కోరి జంగమంబుఁ గొనియాడునతఁడు స
న్మార్గుఁ డతఁడు భక్తిమతియుతుండు
లోకమాన్యుఁ డనుచు వీఁక నుతింతురు
భక్తజనులు బుధులు బసవలింగ ! 145

రాకకు బెదరక పోకకుఁ జెదరక
యుత్తరం బియ్యక వృత్తిఁ జెడక
పట్టినఁ గదలక ముట్టినఁ దొలఁగక
సందడింపుచుఁ బోక జడ్డువడక
పొగడినఁ బొదలక తెగడిన వదలక
మెగ్గుమాట వినక తగ్గువడక
బొంకులం గట్టక టొంకుల నెట్టక
కర్మంబు లాడక కర్మి గాక

కోరి జంగమంబుఁ గొనియాడునతఁడు స
ద్వృత్తి యతఁడు భక్తివిస్తరుండు
లోకమాన్యుఁ డనుచు వీఁక నుతింతురు
భక్తజనులు బుధులు బసవలింగ ! 146

వారి మనోదివ్యపూరితమేళన
నల్లనఁ దనమనం బుల్లసిల్ల
వారి పాదామరభూరుహచ్ఛాయావి
హారకేలితరతి నంగ మలర
వారి భాషామృతవారిధిక్రీడాను
కూలలోలతఁ బల్కు లోలలాడ
వారి యాజ్ఞామేరుతారాద్రిసీమావి
లంఘనక్రియరీతి లక్ష్య మమరఁ

గోరి జంగములఁ గొనియాడునతఁడు స
ద్వృత్తి యతఁడు భక్తివిస్తృతుండు
లోకమాన్యుఁ డనుచు వీఁక నుతింతురు
భక్తజనులు బుధులు బసవలింగ ! 147

ఎఱుకచే సద్భక్తిపరులను గూడక
గౌరవస్థితి చెడఁ గోరువారు
తనయూడినట్టు లాడనిజంగమము నెట్టి
ప్రభువునైనను మీఱి పలుకువారు
లింగార్చనము సేయుసంగతి నైనను
యద్వైతవాదంబు లాడువారు
శివలింగపూజలు శేఖరంబుగఁ జేసి
యంగభోగములకై యలరువారు
జంగమయ్యకు లే దని చని భుజించి
మీఱి భక్తిని జెడి బొంకువారు తమ్ము
మిగులఁ గైవారములు సేయ మెచ్చువారు
భక్తిగోష్ఠికిఁ బాత్రులే బసవలింగ ! 148

తగ నగ్ని నాధారముగఁ జేసి యంబుధి
తనివార నుదకంబు ద్రావునట్లు
భూరుహం బవని నాధారముగను జేసి
యింపార నీరు గ్రహించునట్లు
వారక వత్తి నాధారంబుగాఁ జేసి
తవిలి దీపము నెయ్యి ద్రావినట్లు
యాతనాదేహంబు నాధారముగఁ జేసి
యాత్మ దా సౌఖ్యంబు లందునట్లు
నెసఁగ జంగమమూర్తి పంచేంద్రియములు
నట్ల యాధారముగ సముద్యత్సుభక్తి
హరుఁడు భోగించు భోగంబు లవధరించు
భక్తజనహితార్థంబుగా బసవలింగ ! 149

తల్లి తప్పక యథాపథమ్ముల సేవించి
శిశువులరోగముల్ చెఱచునట్లు
గోవును బిండఁగఁ గొదమను గొన సంత
సిలి జనులకుఁ బాలు చేపినట్లు
చెఱువులజలముఁ బెరుఁగు సస్యంబులఁ
గర్షకులకుఁ గొల్చు గలుగునట్లు
జలములు పత్తిరి శంభుండు గైకొని
భక్తులదురితము ల్బాపునట్లు
దాన తనుమనోధనము లుద్ధతి గ్రహించి
యెలమి మోక్షంబు భక్తుల కలరఁజేసి
లీల నోలాడు జంగమలింగములను
బ్రమసి కలిసినఁ దగు భక్తి బసవలింగ! 150

తాలవృంతములలో గాలి యున్నదె కొంత
విసరంగ విసరంగ నెసఁగుఁగాక
చెలఁదిలోపలఁ దంతువులు గొన్ని యున్నవే
యల్లంగ నల్లంగ నలరుఁగాక
శిలలలోఁ బ్రతిశబ్దములు గల్గియున్నవే
పలుకంగఁ బలుకంగఁ బలుకుఁగాక
చెలమలోపల నొక్క జలనిధి యున్నదే
ముంపంగ ముంపంగ నింపుఁగాక
యట్లు నిర్వంచకుఁడు గానిహరుని భక్తి
పరునిముందట నున్నదే పసిఁడిప్రోఁక
కడఁగి సేయంగఁ జేయంగఁ గలుగుఁగాక
భక్తిమాహాత్మ్యమున మఱి బసవలింగ! 151

చారుతరం బగుహారంబు దా నెంత
హం దానసపము కొల్కిపూన యెంత
భూరితరం బగుభేరి దా నదియెంత
ధ్వనియించు వాదనదండ మెంత
విపులతరం బగువీణె దా నదియెంత
కారణం బగుజీవగట్టు యెంత
స్ఫురతరం బగుబొమ్మ మఱియుఁ దా నదియెంత
సుగతిపై నాడించుసూత్ర మెంత

యట్లు శ్రుతి "యసంఖ్యాత సహస్ర" యనఁగ
నసమతర మగుభక్తిమాహాత్మ్య మెంత
వారు గొనియాడు శివభక్తిపరునిభక్తి
భావితార్థంబు నదియెంత బసవలింగ! 152

భార్య యొక్కతెకన్నఁ బండ్రెండుమాడలు
కానువీసము గురుకలశమునకు
సతులకైనను మణిసరులు మఱియును వి
భూతి వీడ్యములకైనఁ బోక యొకటి
విందులకైనను వివిధపక్వాన్నంబు
లొడయులకైన ము న్నున్నయట్టు
లెలమి నల్లురకును దొలిచూలుపడ్డలు
ముదిగొడ్డు జంగమమునకునైనఁ

దమకు బిడ్డలకైన మంచములు మఱియు
భక్తబృందంబుకైనఁ జాపయు నరుగులు
ననిశ మట్లిచ్చి భక్తుల మని మదింప
భక్తిపరు లనఁగ నగరె బసవలింగ! 153

రాకామలజ్యోత్స్న ద్రావ నిచ్చలుఁ గన్న
నా చకోరంబుల కరుచి యగునె
సహకారపల్లవచయములు దొరకిన
జగతి కోవెలలకుఁ జప్ప నగునె
క్షీరాబ్ధిలోపలఁ గ్రీడింపఁగలిగిన
భువి రాజహంసకుఁ బుల్ల నగునె
విరిదమ్మివాసనవెల్లి ముంచినఁ గ్రోలు
షట్పదముల కనాస్వాద మగునె
బహుళతరదయార్ద్రభావప్రభావన
మహిమఁ దనరు జంగమంబురాక
యతులభక్తిపరుల కావశ్యకం బగుఁ
బరిహృతాభిషంగ బసవలింగ! 154

పాదపంబున కొక్కఫల మైన భోగింపఁ
గలుగునే తత్ఫలార్థులకుఁ గాక
గోవులకును బాలు కొంచిగెఁ డైనను ద్రావఁ
గలుగునే తత్పోషకులకుఁ గాక
యిండ్లకు నీడ లోకించుకం తైనను
గలుగునే తన్నివాసులకుఁ గాక
నదులకు నడ్డెఁ డైనను నీరు ద్రావంగఁ
గలుగునే తత్సేవకులకుఁ గాక
యట్లు దమ్ము భక్తి నర్చించువారల
కభిమతార్థసిద్ధు లలరుఁ గాక
జంగమమున కర్థసంపద లే దని
పలుక నెట్లు వచ్చు బసవలింగ! 155

ఆడఁజోయినతీర్థ మదియుఁ దా నెదురుగా
వచ్చుట తనభాగ్యవశము గాదె
చని వెదకెడితీఁగ తనకాళ్ళఁ జుట్టుట
యదియు నాకస్మికపదము గాదె
పోరిఁబోరి సాధింపఁ బోవునిధానంబు
బరగఁ బొందుట భాగ్యఫలము గాదె
అనయము మనమునఁ దనతలంచుతలంపు
తలకూడు టది మొక్కఫలము గాదె

మొదల సద్గురుప్రతిబింబమూర్తి యైన
జంగమం బేఁగుటకు మహోత్సవ మెలర్పఁ
బొంగి భోగింపఁ దనభక్తిఁ బూజ సేయఁ
బడయునతఁ డుత్తముం డండ్రు బసవలింగ ! 156

భువికిఁ జీకటి యైన రవిఁ గోరు లోకంబు
రవికిఁ జీకటి యైన రక్తి గలదె
ఆఁకలి గొన్నవా రన్నంబు గోరంగ
నన్నంబు నాఁకొన్న నన్న మెద్ది
నో రెండి తెరువరి నీరుకందువ కేఁగ
నీరమునకు దప్పి చేర నెద్ది
శీతంబు గొనువారు చిచ్చుఁ గాయఁగఁ గోరఁ
జిచ్చు శీతముఁ గోరఁ జేర నెద్ది

యట్లు జంగమ మర్థించి యరుగుదేరఁ
దగిలి భక్తుండు తనదరిద్రతయు నెన్న
వెండియును నయ్య తాన యెటుండు నెట్లు
బ్రతుకు నేక్రియ వర్తించు బసవలింగ ! 157

నరులచే నొల్ల రన్యద్రవ్యమును భక్తి
మతులు తా మాశ్రయమదనిరూఢి
నొక్కింతధన మాస లెక్కసేయరు భక్తి
మహిమాన్వితులు ధనమదనిరూఢి
బలియురు కుల మూఁది కలియరు భక్తి స
న్మార్గవర్తులు కులమదనిరూఢి
వెడ నేమములు వాంఛ విడుతురు భక్తి స
మ్మతులు దా మాచారమదనిరూఢి
వెలితి యెఱుకలవికృతంపువేషములను
గ్రొవ్వి విడుతురు శివభక్తిగుణవిదులను
వికలమతులు విద్యామదవేషములను
బద్ధు లాడినఁ గొఱఁతయే బసవలింగ ! 158

## శీలలక్షణము

భవులు చూచినఁ గాదు "పాకము ల్వర్జమే
దుదకాదిక" మ్మను సూక్తి దనర
భవు లంటరా దనుఁ బరగఁ "బదార్థాని
వర్జయే" త్తను నాదివచన మునికి
యింటిబిడ్డలు దాసు లిండ్లలో భవు లుండ
రాదు "చండాలవర్జయ" యనంగ
ననిశము "నాసనా దర్శనా ద్భోజనా
త్సంగా" త్తను పురాణసంహితలను
జాటుఁ గావున సచ్ఛివాచారపదము
తప్పకుండ నడుచు శివధార్మికులకు
నైహికాముష్మికంబు లేపారు శ్రుతులు
"భద్ర మశ్నుతే" యనఁగను బసవలింగ ! 159

ఆత్మేశునకును దా నర్పించఁదగు "స్వాయు
మే వార్పయే" త్తనుభావ మునికి
నొం డర్పితంబు సేయుడు వగుదోషంబు
మును "కిల్బిషం భవే" త్తనుటఁజేసి
కూడ దల్లింగిమై కొనుప్రసాదంబు "శ్వ
మాంసం రుధిర" మనుమాట యెఱిఁగి
చన "దుపవాసాది సంభవే" త్తని శైవ
సంహితలందునఁ జాటుఁ గాన

పరవిత్తోఁ దాము సచ్ఛివాచారపథము
దప్పకుండ నడుచు శివధార్మికులకు
నైహికాముష్మికంబు లేపారు శ్రుతులు
"భద్ర మశ్నుతే" యనుఁ గాన బసవలింగ! 160

వినరాదు పరలోకవిధులు సేయుట "యకు
ర్యాదౌర్ధ్వదైహికం" బనఁగ నిట్లు
భక్తులకును నట్లు పండుగ ల్దమలోన
నెనయ "కుర్యా" త్తన నెలమి మిగుల
లేదు సూతకము పుత్రాదులయందుఁ "బు
త్రాదేర్వి శేషిత" యనఁగ నిట్టు
లతనియర్థంబు "దద్యాత్సుతుసంతతో"
యనఁగ నన్యులకు ని ట్లర్హ మగునె

ఇట్లు శుద్ధశివాచార మీడ్యచరిత
దప్పకుండ నడుచు శివధార్మికులకు
నైహికాముష్మికంబు లేపారు శ్రుతులు
"భద్ర మశ్నుతే" యనుఁ గాన బసవలింగ! 161

తొడరి బ్రహ్మాండసూక్తుల "శ్రితకేసూత
కేతథా" యన నెద్ది సూతకంబు
మును నందికేశ్వరంబును "యథా ధారోన
సూతకం" బన లేదు సూతకంబు
చెంద దేయెడలను స్కాందంబునందును
"సూతకం నహి" యన సూతకంబు
గలదె "సూతక సూతకాచరజస్వలా"
యన శైవసంహిత నట్టిస్త్రీలుఁ
బురుషులును శివు భజియింపఁ బొంద రెందు
సూతకం బనుచుఁ బురాణసూక్తి మ్రోయు
నట్ల "పద్మమివాంభసి" యనఁగ శుద్ధ
భక్తిపథ మిట్టిదియ కాదె బసవలింగ ! 162

చన దన్నసమయమిశ్రము "సర్వభక్షిత
వాయసో" యను సూక్తి మ్రోయుఁ గాన
భక్తిహీనం బైన బ్రతుకఁగూడదు "భక్తి
హీన నాశంకరి" నా నెఱింగి
శ్రద్ధారహిత మగు సత్క్రియ వృథ "యవ
శ్యం శ్రద్ధయా వినా" యనుటఁజేసి
మీఱఁ గాఁ దాచార మితి "శివాచారం న
లంఘయే" త్తన నవిలంఘ్యలీలఁ
జాటుఁ గావునఁ దచ్ఛివాచారపదము
దప్పకుండ నడుచు శివధార్మికులకు
నైహికాముష్మికంబు లేపారు శ్రుతులు
"భద్ర మశ్నుతే" యనుఁ గాదె బసవలింగ ! 163

ప్రాణలింగిని "శరీరం న దహే" త్తన
దహనంబుఁ జేసినఁ దప్పు వచ్చు
"నిర్మలం క్షిత్యాం వినిక్షిపేల్లింగిన"
మనఁగ నిక్షేపంబ యాదిమతము
చనదు గాల్పంగఁ దా "జ్ఞానాగ్నిపాకస్య
పచనం యథా" యనంబడినయెడలు
ధరను నిక్షేపింపఁ దగు "జీవమానే య
థా తథా" యనెడుపదంబుఁ గూర్చి
యిట్టి శుద్ధశివాచారహితచరిత్ర
దప్పకుండ నడుచు శివధార్మికులకు
నైహికాముష్మికంబు లేపారు శ్రుతులు
"భద్ర మశ్నుతే" యనఁగను బసవలింగ ! 164

జ్ఞానోత్తరంబునఁ జను "లోకధర్మాఖ్య
మాచరే" త్తనెడు నగోచరముగ
నలి సూతసంహితోక్తులను "తమత్యంత
మాశ్రిత్య" యనుచుఁ దా విశ్రుతముగఁ
బ్రీతి సౌరమునందు "ధాతానియంతివై
కర్మ" యంచును ధర ఖ్యాతి దనరఁ
గలయంగ సౌరసూక్తులయందు "మాతృకా
స్తేసుత" యనుచు నాదీపితముగ
బ్రమోయు లౌకికాచారంబు వాయఁడేని
శాస్త్రములు నన్యసంస్తుతుల్ చదివెనేని
పూర్వసూతకక్రియలందుఁ బొందెనేని
పాతకుఁడు వాఁడు గాఁ డెట్లు బసవలింగ ! 165

కరి తురగాందోళ వరరథాద్యాఢ్యులై
పోవువారును మోచిపోవువారు
నిష్టార్థ మర్థుల కిచ్చుచుండెడువారు
దిరిపెంబు మనువుగాఁ దివురువారుఁ
గడుమంచికుడుపులు గుడుచుచుండెడువారుఁ
గూడు లేకయ మదిఁ గుందువారు
నంగనాకేళి ననంగుఁ బెన్గెడివారు
వనితావియోగులై వనరువారు

అయ్యా నిన్నుఁ గొల్చునయ్యాలు, కొలువని
కొయ్యాలే గదయ్యా జియ్యా దేవ!
వినుతనిర్మలాంగ! విరహితవ్యాసంగ!
పటుదయాంతరంగ! బసవలింగ! 166

మహితశివాచారమార్గానువర్తులై
నడుచువారును దప్పి నడుచువారు
జంగమారాధనల్ సల్పుచుండెడువారు
నోలి దుర్భవవార్ధిఁ గూలువారు
సిద్ధప్రసాదసంసిద్ధిఁ బొందెడువారు
నర్పితానర్హులై యణఁగువారు
భక్తిసంపదఁ దేలి ప్రఖ్యాతు లగువారుఁ
బాయనినిందలఁ బడెడువారు

అయ్యా నిన్నుఁ గొల్చునయ్యాలు, కొలువని
కొయ్యాలే గదయ్యా జియ్యా దేవ!
వినుతనిర్మలాంగ! విరహితవ్యాసంగ!
పటుదయాంతరంగ! బసవలింగ! 167

శివశివా ! కర్ణుండు గవచ మిచ్చియుఁ జెడె
వస్త్ర మిచ్చియు దాసి వరము వడసె
అక్కట ! ఖచరేంద్రుఁ డంగ మిచ్చియుఁ జెడె
వ్రేలిచ్చి మంచయ్య విజయుఁ డయ్యె
కటకట ! శిబి తన కండ లిచ్చియుఁ జెడె
మృగమాంస మర్పించి మెఱసె నెఱుకు
చెల్లబో ! బలి భువి నెల్ల నిచ్చియుఁ జెడె
చోళుఁ డొకుక్కు రిచ్చి సుగతిఁ బొందె

నట్లు లింగవిముఖు మగు దాన ధర్మ ప
రోపకార విక్రమోద్ధతములు
నిష్ఫలంబు గాక నెట్టన శరణుల
భక్తియుక్తి కెనయె బసవలింగ ! 168

జూదంబునను మూర్ఖ సోమార్ధధరుఁ గూడె
జూదంబునను బాండుసుతులు సెడిరి
మృగయాత్ర నొకచెంచు మృడుపురంబున కేఁగె
మృగయాత్ర రాముండు వగను జెందె
విషయసంగతి నంబి విశ్వేశుఁ బలికించె
విషయసంగతి బ్రహ్మ విరళ మయ్యె
హింసఁ దెలుఁగుజొమ్మఁ డీశ్వరు మెప్పించె
హింసచే మాండవ్యుఁ డెక్కెఁ గొఱ్ఱు

తథ్య మట్లు గాక ధర "నధర్మాధర్మ
తాం వ్రజే" త్తను శ్రుతి దప్పునయ్య !
పరమభక్తియుక్తిపరు లెట్లు నడిచిన
బద్ధ మదియుఁ గాదె బసవలింగ ! 169

ఱాల వైచినసాంఖ్యుఁడే లోకనుతుఁ డయ్యె
మల్లెలు వైచినమరుఁడు మడసె
పాదంబునను దన్ని పరగెఁ గన్నప్పఁడు
పాదంబుఁ గన హరి పంది యయ్యె
మేలంబు లాడి యమ్మిన శివు న్గనె
నుతిఁ జేసి వేదము నొగిలె శక్తి
భువిమీఁద నడిపించి భోగయ్య వెలసెను
మోచి తెచ్చిన దశముఖుఁడు చెడియెఁ

దలఁప నిట్టు శివుఁడు వలచుట పుణ్య మొ
ల్లమియుఁ బాప మెన్నఁ గ్రమములందు
నిట్టు లౌట లేల నెఱి నిజంబుగ జగ
త్ప్రత్యయంబు గాదె బసవలింగ ! 170

ఘనుఁ డీశుఁ డన్న బాణున కిచ్చెఁ జేతులు
గా దన్నవ్యాసునికరముఁ ద్రుంచె
దైవంబు హరుఁ డన్నఁ దలలు వంకయ కిచ్చెఁ
దాఁ గర్త నను బ్రహ్మతలయుఁ ద్రుంచె
నమ్మిన చోళునినాఁతికి ముక్కిచ్చె
ధిక్కరించినవాణి ముక్కుఁ గోసె
నుతికి మెచ్చిచ్చెఁ గన్నులు కాళిదాసికి
గర్వమాడిన భగుకనులు పొడిచె

దండి కిచ్చె మేను దనకును శరణన్న
మరు ననంగుఁ జేసె మాఱుకొన్నఁ
గాన శివుఁడె యాదికర్త యౌటకు వేఱె
ప్రత్యయంబు లేల బసవలింగ ! 171

మును బ్రహ్మహత్య చేసినయరియమరాజు
తనువుతో లింగంబుఁ దనరఁ జొచ్చెఁ
జని భ్రూణహత్య చేసినవీరచోళుఁడు
బొందితోడుత శివపురికి నేఁగెఁ
జెచ్చెఱఁ బితృవధ చేసిన యాకాట
కోటఁడు రజతాద్రికోటఁ గొనియెఁ
జేకొని శిశువధ సేసినచిఱుతొండఁ
డేడువాడలతోడ నీశుఁ గలిసెఁ
దగనిక్రతువు సేసి దక్షుండు దల కోలు
పడియెఁ బుణ్యపాపఫలము లెన్నఁ
గర్మవాదు లెల్లఁ గసిమసి వైరి స
ద్భక్తిమహిమ లేక బసవలింగ! 172

భృగుకూర్మిపత్నికిఁ దెగినఁ దప్పునఁ బది
సారులు పుట్టుచుఁ జచ్చుచుండెఁ
జెలికాండ్రతప్పును జేకొన్న తప్పునఁ
దనయాలిఁ గోల్పోయి ధర ను దిరిగె
మున్ను బలిని గట్టి మొనసినందుకు దశ
కంఠునిసుతునిచేఁ గట్టువడియెఁ
గౌరవాదుల కులక్షయము సేయుటఁజేసి
ధరఁ గులక్షయ మయ్యెఁ దనకు నెపుడు
నెఱుఁగకుండ వాలి నేసినతప్పున
నేటు వడియె నొక్కయెఱుకుచేతఁ
గాన విష్ణుఁడాది కర్మవశ్యులు గారె
భక్తిపరులు గాక బసవలింగ! 173

కలఁ డన్నఁ జేపట్టె నిల నఘహాను లే
దన్నభట్టాచార్యు నటులునూఁకె
భక్తి సేయఁగ నుండె బాణునికడ భక్తి
పూరుఁ డై నసనత్కుమారుఁ డెనకెఁ
బ్రణుతి చేసినను మల్హాణుకోర్కె నెఱవేర్చె
నిందించుదక్షుని నీఱుసేసె
మఱుఁగు సొచ్చినఁ గాచె నెఱయ మార్కండేయు
మీఱిన నరసింహుఁ జీఱె తునిమెఁ
దలఁచుమాత్ర శ్వేతు ధన్యునిఁగాఁ జేసె
మఱచినట్టిమునులమద మడంచెఁ
గాన శివుఁడె యాదికర్త యాటకు వేఱె
ప్రత్యయంబు లేల బసవలింగ ! 174

సిరియాలుచేరువఁ జరియించు నయ్యోడు
వాడలవా రీశుఁ గూడఁ జనిరి
సామవేదులతోడి సంగతిఁ జేకొన్న
పురములు కైలాసమునకుఁ జనియె
దక్షుఁ గూడి సురలు దక్షులై యెంతేయు
భంగపడరె వీరభద్రుచేత
భళ్ళాణుఁ గూడిన భక్తు లెల్లను గిరి
పతిపురి కేఁగిరి కుతుకమునను
భక్తులైనవారు పలువిధంబుల శంభుఁ
గొలిచి రజతశైలనిలయు లైరి
జగతి నట్ల "కర్త సంసర్గయా" యను
పలుకు తప్పదయ్య బసవలింగ ! 175

శ్రుతులకుఁ దాఁ గాక పతి నని ముఖమునఁ
 దాల్చిన పద్మజుతలయుఁ బోయెఁ
దా దిక్కు రెండువేదములకుఁ గా కని
 పోఁగిన సోమకుపొట్ట వ్రచ్చెఁ
దాఁ దెత్తుఁ గాక వేదము లని వెనుకొన్న
 మాధవుం డటు మున్ను మత్స్య మయ్యెఁ
దాఁ గాక వేదముల్ దగిలి భాగింపంగఁ
 గల నన్న వ్యాసునికరముఁ దునిమె
మొదల నఖిలవేదములును "శివో మాంశ్చ
పితరో" యనఁగఁ గర్త శ్రుతుల కెల్ల
శివుఁడె యనక యిట్లు చెదుదురె యా హరి
బ్రహ్మ మొదలుగాఁగ బసవలింగ! 176

ఆగమంబులు ద్వైత మందురు శబరరు
 ద్రునివెన్కఁ గుక్కలై చనియె నండ్రు
ఆమ్నాయములు మూల మండ్రు దధీచిశా
 పముచేతఁ దచ్ఛక్తి వాసె నండ్రు
శ్రుతులు ఘనం బండ్రు సోమకుం డనువాఁడు
 దొంగిలి కొనిపోయి మ్రింగె నండ్రు
ఆది వేదము లండ్రు వ్యాసునిచేత ని
 ప్పాట విభాగింపఁబడియె నండ్రు
సంతతంబు ద్విజులు స్వాధ్యాయపరు లయ్యు
నిశ్చయార్థ మెఱుఁగనేర రెందు
నట్లు గా కధర్ము లగుశాపసహితుల
పలుకు లిటులు గావె బసవలింగ! 177

మహి యెల్ల నెఱుఁగ బ్రాహ్మణుల నారాధించి
పరశురాముండు దా శరధిఁ జొచ్చె
ధర యెల్ల నెఱుఁగంగ ధరణీసురుల కిడి
గౌతము గోహత్యఁ గట్టువడియె
నఖిలంబు నెఱుఁగంగ నగ్రజన్మునకు దా
నము సేసి బలి బంధనమునఁ బడియెఁ
ద్రిజగంబు లెఱుఁగంగ ద్విజులకోరిక సల్పి
జలజాప్తసుతుఁడు తి త్తొలువఁబడియె
విప్రుఁ దండ్రిఁ జంపి వెయ్యేల చండుండు
ధాత్రి శివుప్రసాదపాత్రుఁ డయ్యె
మేలె గాక "మన్నిమిత్తం కృతం" బను
పలుకు తప్పునయ్య బసవలింగ! 178

దక్షునకును మహాధ్వరఫలంబునఁ దొంటి
తల వోయి మేషంబు తల చెలంగె
రహి సగరుని మఖారంభఫలమ్మున
సన్మునిచేఁ జావు సంభవిల్లె
నహుషభూవల్లభునకు యజ్ఞఫలమున
నప్పుడే సర్పత్వ మతిశయిల్లె
మున్ను ధర్మజునకు జన్నంబుఫలమున
బంధుక్షయంబు నాపదలు వచ్చె
సామవేది క్రతువుభూమి ముప్పదియాఱు
పురములు గొని శివుసిపురికి నేఁగెఁ
బ్రతిభఁ గ్రతుఫలంబు భక్తికి సాటియే
పటుదయాంతరంగ! బసవలింగ! 179

రాజసూయసహస్రరాసు లిప్లైణాది
నాథుభక్తికి సరి నాఁగఁ దగునె
నరయాగలక్షలు సిరియాలుసెట్టి కృ
త్యమునకుఁ బ్రతి యని యాడఁదగునె
యశ్వమేధసహస్ర మైనఁ గెంబావిభో
గయ్యభక్తికి నెన యనఁగఁదగునె
యలపౌండరీకయాగార్బుదములు నిరు
వత్తుభక్తికి సాటి వచ్చు నెట్లు
బహుసువర్ణయాగ పద్మ మహాపద్మ
వితతి చెన్నబసవవిభునిమహిమ
తలఁపఁగలుగువారి ధన్యత్వమున కెట్లు
ప్రతి యనంగవచ్చు బసవలింగ ! 180

దేవయజ్ఞము గుణాతీతుండు మాదర
చెన్నయ్యగారికి సిద్ధమయ్యె
పితృయజ్ఞ మబ్ధిగంభీరుఁడై విలసిల్లు
చోళభూవిభునకు సులభ మయ్యె
భూతయజ్ఞము మహాపురుషరత్నము చెన్న
బసవప్రసాదికిఁ జాలుపడియె
బ్రహ్మయజ్ఞము చాలఁ బరమయోగీశ్వరుఁ
డా కిన్నరయ్యకు నచ్చువడియె
మును మనుష్యయజ్ఞ మనఘుండు సిద్ధరా
మయ్యకుఁ గడు సాంగ మయ్యెఁగాక
జడుల కేల మిగుల సమకూఱు, భక్తివి
భ్రాజితాంతరంగ ! బసవలింగ ! 181

అన్నదానము సేయ నన్యులశక్యమే
శూరుండు కరికాలచోళుక్రియను
వస్త్రదానము సేయ స్వల్పులశక్యమే
ధన్యుండు దేవరదాసిపగిది
ప్రాణదానము సేయ పరులవశంబె మ
హాత్ముండు ముసిడిచౌడయ్యభాతి
కన్యదానము సేయఁగా నొరులకు నౌనె
లాలితకీర్తి భళ్ళాణుమాడ్కి
యట్లు కడఁగి యమ్మహాధర్మములు సేయ
హరి విరించి వాసవాదులకును
దరమె సేయ నవ్విధమున మహోదార
పటుదయాంతరంగ ! బసవలింగ ! 182

ప్రతిలేని గజదానచతురత మడివాలు
మాచయ్యగారికి మహిమ వెలసె
శస్త్ర విద్యాదానశక్తి యీ క్షితిలోనఁ
గల్లిదేవయ్యకు నుల్లసిల్లె
కొమరారు నభయదానము సకలేశ్వర
మాదిరాజయ్యకు మానమయ్యె
యవిరళంబుగ శరణాగతదానంబు
కిన్నరబ్రహ్మయ్య కెన్నఁబడియె
నేల యిన్ని చెప్ప నెల్లవ్రతము లెల్ల
దానములును నెల్లధర్మములును
గర్ములకును నెట్లు గలుగును శివభక్తి
భావకులకుఁ గాక బసవలింగ ! 183

"సత్యంవద" యనెడి శబ్దంబు కుమ్మర
గుండయ్యయందు నెక్కొనియెం గాదె
"ధర్మంచర" యనెడి తత్త్వంబు సిద్ధరా
మునియందుం దాం దుదిముట్టెం గాదె
మొగి "నహింసా పరమోధర్మ" యన దేవ
దాసియయందుం దాం దనరెం గాదె
"బ్రహ్మచరామి" యన్ పల్కు మా యల్లమ
దేవునియందు సంధిల్లెం గాదె
యివ్వి తత్త్వవిదుల కగును దురాత్ముల
కెట్టిదుష్టజనుల కెట్టివ్రతుల
కిట్టిమహిమ లున్నవే సముద్యద్భక్తి
భావకులకుం గాక బసవలింగ ! 184

మఱి "కులిశః కుసుమతి" యనువచన మే
ణాదినాథుండు ప్రఖ్యాతి చేసె
నలి "దహన స్తుహినతి" యనువచనంబు
పిళ్ళనైనారు దాం బెంపుచేసె
తెల్లంబు "వారాన్నిధిః స్థల" త్యనుమాట
నాగీశనయనారు వఱలంజేసె
తివిరి "శత్రుర్మిత్రతి" యనెడువాక్యంబు
సింధుభళ్ళాణుండు చెలంగంజేసె
రమణ ముసిడిచౌడరాయండు "విషమప్య
మృత" తనియెడుమాట మెఱయంజేసె
నిట్టిమహిమ గలుగునే యన్యులకు భక్తి
భావకులకుం గాక బసవలింగ ! 185

శ్రుతివిరుద్ధమె "పితరోమాతరవ్రత"
యనఁ దండ్రి వధియించు టాగమోక్తి
నిలఁ బరోక్షమె "యజే దేకం విరూపాక్ష"
మనఁ బుత్త్రి వధియించు టాగమోక్తి
దుష్టమార్గమె "తత్ర తుష్యామి సువ్రతే"
యన మాంస మర్పించు టాగమోక్తి
ప్రతిబద్ధమే "శరీరం గృహిణీ చైవ"
యన నాతి నిచ్చుట యాగమోక్తి
యిదియు వేదబాహ్యమే పురాతనగణ
చరిత మట్ల గాఁగ శర్వకృపకు
హేతు వయ్యె నుపమ లింకేటి క్రూరకే
పటుదయాంతరంగ! బసవలింగ! 186

హరుఁడు దేవికి బసవాక్షరత్రయమహ
త్వమ్ముఁ జెప్పిన పురాణమ్ము లెఱిఁగి
వసుధపై వృషభంబు బసవనామముఁ దాల్చి
యుదయించె ననఁగ వేదోక్తు లెఱిఁగి
ప్రభువాది గాఁగఁ బురాతనభక్తులు
బసవనుతులు సేయుభాతి యెఱిఁగి
యవిరళసద్భక్తనివహంబు బసవఁడు
త్తమలింగ మని యాత్మఁ దలఁచు టెఱిఁగి
యట్ల యోజింతు నర్చన లచ్ఛభక్తి
మదిని భావింతు మఱియు సమ్మతము దనర
నిన్నె నిలుపుదు మది నెప్డు నీవె నాకుఁ
బ్రాణ మనుచును మది నమ్మి బసవలింగ! 187

నుతులు సేయుదు నమస్కృతు లాచరింతుఁ గై
వారంబు సేయుదు గారవింతు
వినుతింతు భూషింతు వెలయింతు గణుతింతు
నంకింతు భంగింతు ననునయింతుఁ
బాడుదుఁ జదువుదుఁ బ్రణుతింతు బోధింతుఁ
బ్రస్తుతు లొనరింతు విస్తరింతు
వర్ణింతుఁ గీర్తింతు వడిఁ బ్రశంసింపుదుఁ
బ్రార్థన సేయుదుఁ బరిఢవింతు
నెయ్య మొదవ నిన్ను నీతిగా మద్వాక్స
మూహిఁ బూన్తు వృషసమూహితార్థ్య !
యుష్మదీయపదపయోజాతయుగముపై
భక్తికారణాంగ ! బసవలింగ ! 188

లీలమై సద్గురులింగమూర్తివి గాన
కడువడి మ్రొక్కులకర్త వీవె
సంగతంబుగఁ బ్రాణలింగాంగుఁడవు గాన
పూజలు గైకొనుప్రోడ వీవె
జంగమప్రాణానుసంగివి గావున
నారాధనల కాశ్రయంబు నీవె
భాస్వన్మహాప్రసాదస్వరూపివి గాన
భోగానుభోగోపయోగి వీవె
పరమభక్తియుక్తిభావానుగతుఁడవు
విగతకల్మషుండ వగుటఁజేసి
మదిని నిన్ను నమ్మి మఱి నిన్ను వినుతింతుఁ
బటుదయాంతరంగ ! బసవలింగ ! 189

బసవయ్య నీస్తుతు లసలార విను భక్త
గణసంస్తుతులు విను గ్రాహకుండ
బసవన్న నీనుతుల్ వ్రాయక పఠియించు
భక్తులఁ బ్రణుతించు పాఠకుండ
బసవయ్య నీస్తుతుల్ భక్తితోఁ గొనియాడు
భక్తులఁ గొనియాడు భక్తిపరుఁడ
బసవయ్య నీస్తుతుల్ పచరించుభక్తులఁ
బ్రచురింపఁ జాల్పుడు భక్తిపరుఁడ
నిలను భక్తుల కీశుచే నీప్సితార్థ
భూరిసంపద లిప్పించు భూరిమహిమ
వినుచుఁ జదువుచుఁ గొనియాడి విస్తరించు
వాఁడ వన్నిటు కరుణించు బసవలింగ ! 190

బిడ్డలఁ జీరెడు ప్రియమెంత యనుచు నీ
పేరు నాలింగంబుఁ బెట్టినాఁడ
నోలి నాజిహ్వాగ్ర మాలిమి నుండిన
దైవ మనుచు నిన్నుఁ దాల్చినాఁడ
నిల నీకు వ్రే లిచ్చు వల పెంత యనుచు నా
దేహ మంతయు నివేదించినాఁడఁ
బద్యముల్ చెప్పుట పరమశ్రేష్ఠం బని
పద్యముల్ విరచించి ప్రబలినాఁడ
నట్లు గాన "దాస్యమాహుశ్చతుర్విధం"
బనిన వేదసూక్తి కగ్గలముగ
నెఱయఁ దక్కిపట్టి నీదాసిఁ జుమ్మయ్య !
పటుదయాంతరంగ ! బసవలింగ ! 191

తగిలి నీపాదపద్మములు నాశిరమున
నచ్చొత్తఁగా మనం బుచ్చిపాఱ
నలి నీగుణాంకముల్ నాజిహ్వతుద నాఁటి
కొనఁగఁ గోరికలత కొనలువాఱ
రమణ నీనామాక్షరములు నాయురమున
వ్రాయవే వీఁపున వఱలివెలుఁగ
నర్థి నీమూర్తి నాయంతరంగంబున
నే నిల్పవే మది నెలవుగొనఁగఁ
దివిరి నీప్రసాదదృష్టిపైఁ దగ వెల్లి
గొలుపవే ప్రమోద మలుగువాఱ
నిర్జితాభిషంగ! నిత్యగుణోత్తుంగ!
పటుదయాంతరంగ! బసవలింగ! 192

నాయయ నా జియ నా యన్న నాతండ్రి
నామనోనాయక నాప్రియుఁడ
నాదాత నాభ్రాత నారాజ నాస్వామి
నాయిలువేలుప నావిభుండ
నాకర్త నాభర్త నానాథ నాదేవ
నాగురులింగమా నాగురుండ
నాయాప్త నాయాత్మ నామిత్ర నావర్తి
నాప్రాణలింగంబ నాహృదీశ
నీవ నాకు దిక్కు నీవ నా "మాతాపి
తా" యనంగ నొండుతలఁపు లుడిగి
కరుణఁ జూడు మయ్య శరణార్థిఁ జు మ్మయ్య
భక్తి యొసఁగు మయ్య! బసవలింగ! 193

పశుపతి విటు "పశుపాలాభిగామినో"
యనఁగ నాతలఁపు నీయదియ గాదె
ధర నీయవియె గావె "త్వత్ప్రయుక్తఃకరో
మ్యహ" మనఁగా నాశుభాశుభములు
ధర ధర్మ మిట్లు "భృత్యాపరాధస్స్వామి
నోదండ" యన నీకె కాదె సిగ్గు
క్షమియింపు "మపరాధశతసహస్రాణి" నా
వెండియు నాయందు వెదకఁ గలదె

బసవ దండనాథ ! భక్తజనావన !
భవసమూహదూర ! భద్రకీర్తి !
బసవ ! బసవమూర్తి ! బసవన్న ! బసవయ్య !
బసవ ! బసవరాజ ! బసవలింగ ! 194

నీబంట నీపట్టి నీకింకరుండ నీ
పరిచారకుండ నీప్రాంతవాఁడ
నీశిష్యవరుఁడను నీకవీశ్వరుఁడ నీ
పౌరాణికుండ నీపాఠకుండ
నీయోగి నీతొత్తు నీయడిగట్టు నీ
దాసానుదాసుండ నీసుతుండ
నీవర్తి నీపాదనీరేజనుతుఁడ నీ
శిష్టహితుండ నీయిష్టమతిని

దలఁప శరణ "మన్యథాశరణం నాస్తి"
యనుచు నమ్మినాఁడ నాదరించి
కరుణఁ జూడు మయ్య శరణార్థిఁ జుమ్మయ్య !
భక్తి యొసఁగు మయ్య ! బసవలింగ ! 195

పూర్వంబు మఱచి యపూర్వంబు ప్రౌఢ్ధగాఁ
జెలఁగి చరించెడు సిద్ధబసవ !
దక్షిణాతీతనితాంతజంగమభక్తి
సీమగాఁ జరియించు సిద్ధబసవ !
పశ్చిమదిశ మాని భక్తప్రసాదంబు
సీమగాఁ జరియించు సిద్ధబసవ !
యుత్తరం బది లేక యురుశివాచారంబు
సీమగాఁ జరియించు సిద్ధబసవ !
పరమభక్తవరుల వరగృహాంగణములు
సీమగాఁ జరించు సిద్ధబసవ !
యొం డెఱుంగ నాకు నురుతరంబుగ దిక్కు-
దెసయుఁ గావె నీవు బసవలింగ ! 196

ఓ భక్తిభండారి ! యో ముక్తసంసారి !
యో గుణోద్దామ ! యో యోగధామ !
యో కరుణాకర ! యో కాలకంధరో !
దాన్యైకశీల ! యో గానలోల !
యో జంగమప్రాణ ! యో నిత్యకల్యాణ !
యో ప్రమథేశాంశ ! యో ప్రశాంత !
యో దండనాయక ! యో యిష్టదాయక !
యో సద్గుణధురీణ ! యో ప్రవీణ !
భక్తభయవినాశ ! పాలితయక్షేశ !
యో శుభప్రకాశ ! యో యధీశ !
అవధరింపుమయ్య ! యక్కటా యను మయ్య !
భక్తి యొసఁగు మయ్య ! బసవలింగ ! 197

అయ్యా ! నీధర్మమే ! యాదివృషభమూర్తి !
జియ్యా నీధర్మమే శివవిలాస !
భవ్య ! నీధర్మమే ! ప్రమథసంగాసంగ !
దేవ ! నీధర్మమే ! దివ్యమహిమ !
స్వామి ! నీధర్మమే ! సచ్చిదానందాత్మ !
నాథ ! నీధర్మమే ! నవ్యరూప !
దివ్య ! నీధర్మమే ! త్రిజగదేకారాధ్య !
విభుఁడ ! నీధర్మమే ! విషవిదళన !
అవధరింపు మయ్య ! యక్కటా యను మయ్య !
కావు మయ్య ! నన్నుఁ బ్రోవు మయ్య !
కరుణఁ జూడు మయ్య ! శరణార్థిఁ జు మ్మయ్య !
భక్తి యొసఁగు మయ్య ! బసవలింగ ! 198

ప్రభుగుణస్తోత్రైకపాత్రుండు బసవయ్య
శ్రీపాదములయందుఁ జిక్కినాఁడ
మాదిరాజయగారి మనుమండు బసవయ్య
శ్రీపాదములయందుఁ జిక్కినాఁడ
మడివాలు మాచయ్య మదకరి బసవయ్య
శ్రీపాదములయందుఁ జిక్కినాఁడ
కుమ్మరగుండయ్య తమ్ముండు బసవయ్య
శ్రీపాదములయందుఁ జిక్కినాఁడ
భక్తితోడ నీదు పాదపద్మంబులు
నమ్మి వెతల నెల్లఁ జిమ్మి ఖిగుల
భవభయంబు వాయు బంటను నీభక్తి
కెసఁగఁ జిక్కినాఁడ బసవలింగ ! 199

మాదిరాజయ్య వాఙ్మయదృశ్యమై శివ
భక్తసభల నట్ల పరగుచుండ
బాచిదేవుని వచఃపద్ధతి దివ్యమై
భక్తసభల నట్ల పరగుచుండ
కల్లిదేవుని మహాకథనంబు కెనయఁగా
భక్తసభల నట్ల పరగుచుండ
బసవ నీగీతప్రబంధంబునకుఁ బోలి
భక్తసభల నట్ల పరగుచుండ
సకలభక్తవచనసంగతిఁ దేటయై
భక్తసభల నట్ల పరగుచుండఁ
జేయు మయ్య! నిన్నుఁ బాయక వేఁడెద
వసుధ నామకృతియు బసవలింగ! 200

ఆది శబ్దబ్రహ్మ మనుచును నక్షరా
త్మక మని శబ్దశాస్త్రములు వలుక
నవి నూకి భట్టవేదాంతశాస్త్రంబు ల
న్యోన్యపథ్యంబులై యొప్పుచుండ
నవి నిరసించి సాంఖ్యంబును యోగశా
స్త్రంబును దమలోనఁ జర్చసేయ
నిన్నియుఁ గా వని యిదమిత్థ మనుచు స
ర్వప్రమాణంబు లీశ్వరుగుఱించి
న్యాయవృత్తిఁ బరగు న్యాయవైశేషిక
మతఁడె బ్రహ్మ మనుచు శ్రుతులఁ గలిసి
వినుతి సేయుచుండ వేఱొండుదైవంబు
వసుధలోనఁ గలఁడె బసవలింగ! 201

రమణ శ్రీలైంగ్యపురాణంబునందు "న
రకప్రాప్నుయా" త్తనఁ బ్రకటితముగఁ
జర్చింప శివధర్మశాస్త్రము నట్లు "త
ద్విధ నరకం" బని విశ్రుతముగ
"తదవశ్యభోజన దానకుర్వంతియే
నరకం వ్రజే" త్తనఁ బరగునట్లు
స్కాందంబునను మఱి "కశ్చాచరత్యాది
దాతా" యని పురాణతతుల నట్ల
బ్రహ్మాయు శ్రుతులు "ప్రత్యవాయో" యనెడుఁ గాన
భర్గభక్తి లేనిబ్రాహ్మణులకు
దాన మిచ్చునట్టి దాతకు నరకంబు
పాటుదప్ప దయ్య బసవలింగ ! 202

శివానుభవ సూత్ర వివరము

ఆత్మఁదాన వ్యక్తమందుఁ బ్రాణము పుట్టుఁ
బ్రాణమునందు సంభవము మనసు
మనసున వాగ్వృత్తి జనితమా వాగ్వృత్తిఁ
బ్రభవించు శబ్దప్రపంచ మట్ల
యాత్మాది భూతాది యందంగ ముదయించు
నంగంబునం దింద్రియములు వోడము
నింద్రియంబుల జనియించు విషయము ల
వ్విషయంబులను సంభవించుఁ గోర్కు
లర్పితంబు లగుచు నారోహి నవరోహి
నాత్మఁ దోఁచు నణఁగు నదియు నవియు
నాత్మయును దదర్పితాదులయందు ను
ద్భవముఁ జెందుచుండు బసవలింగ ! 203

పశువు దా జీవాత్మ పాశ మంతర్దేహ
బంధ మా పశుపాశపతి గురుండు
పశువు పుట్టిన సప్తదశలింగజాతి కం
తర్దేహ పాశబంధంబుఁ ద్రుంచి
పాంచభౌతికబహిఃప్రకృతి పూర్వము వుచ్చి
ప్రాణంబు వాక్ప్రచారత లయించి
ప్రాణలింగాంగసంబంధ మధిష్ఠించి
యం దాత్మఁ దప్పక హత్తుకొల్పి
యాత్మయును బ్రాణలింగనిరంతరాత్మ
యాత్మ దా ఘనతరము సుఖాంచితాను
భూతి స్వామి భృత్యజ్ఞానరీతి నట్లు
యొసఁగుమీ ప్రసాదంబును బసవలింగ ! 204

ఆరాధ్యదేవు నిజాంశమౌ భావగ
ర్భమున నై యిష్టలింగము సృజింప
సత్కృపాచార్యుఁ డాసత్కృపాహస్తగ
ర్భమునఁ బ్రసాదదేహము సృజింపఁ
దద్దేశికేంద్రుఁ డాత్మశ్రుతిప్రాణగ
ర్భమునఁ బ్రాణప్రదానము సృజింపఁ
దద్గురుమూర్తి స్వతంత్రప్రసాదగ
ర్భమున శుద్ధప్రసాదము సృజింప
భావలింగంబు ప్రాణంబు ప్రకృతిఁ గూర్చి
దాని కసమప్రసాదచైతన్య మొసఁగి
యట్టి చరలింగమూర్తియౌ నాప్రసాది
కెసఁగ గౌరవ మొసఁగిన బసవలింగ ! 205

ఆత్మజాగ్రదవస్థమై స్థూలభూతస
    చ్చైతన్య మగుచు విఖ్యాతి నుండు
నాత్మ కంఠమున స్వప్నావస్థమై సూక్ష్మ
    భూతచైతన్యవిస్ఫూర్తి నుండు
నాత్మ సుప్తావస్థ నటనాభితలమునఁ
    జైతన్యశూన్యవిశ్రాంతి నుండు
నాత్మ సర్వావయవాన్విత మగుచుఁ దు
    ర్యావస్థమై యట్లు యణఁగి యుండుఁ
జను నవస్థాంతరనిమిత్తజనితకర్మ
ములు తదారంభదేహసంభోగవేళ
నర్పితముఁ జేసి పొందు సుఖాతిశయము
నెనఁగుచుండుఁ బ్రసాదాత్మ బసవలింగ ! 206

అలరు జాగ్రదవస్థ నఖిలేంద్రియములు ని
    వేదించి పొందుఁ బ్రసాది కర్మ
వితతులు స్వప్నావగతములై తల లెత్తఁ
    గాఁ దదీయోపభోగప్రసక్తిఁ
గదలని భూతసూక్ష్మములచే నారంభ
    మైన యంతర్దేహ మంగవింపఁ
దత్కర్మపటలముఁ దగ సమర్పించి స్వ
    ప్నమునఁ బొందుదు రీఘనప్రసాది
కలల నున్మేషకరగతి క్రమము లగుట
నవియు నర్పించి పొందు నిరంతరప్ర
సాది పొందంగ నేర్చునే జడత నుడిగి
భ్రమయు వెఱపును మఱచియు బసవలింగ ! 207

అనుదినపూర్వనిద్రార్పితశివలింగ
గర్భముద్రితసుఖాక్రందనేంద్రి
యములు సద్గురుకృపాయత్త రాజసగుణ
సన్నిధి నాయుషస్సవనవేళఁ
బ్రభవించి నియమితప్రాణలింగస్పర్శ
నాంతరంబులను దినాంతరంబు
కలయ సద్గురుసాత్వికప్రసాదైక్యసు
స్థితిపదార్థక్రియార్పితసుఖంబు
లొసఁగుచుఁ దదీయసుగుణతామసగుణప్ర
సాదసమరస సహిత భావాదిలింగ
గర్భమున విశ్రమముఁ బొందఁగాఁ బ్రసాది
కెసఁగ నుపచారములు నొప్పు బసవలింగ ! 208

అది ద్వైత మాచార్యుఁ డధ్యాత్మ మైనట్టి
యది భూత మగు పరమాత్మలింగ
మాపరమాత్మ జీవాత్మసంగతి కుపా
దానంబు ప్రాణ మాధార మనఁగ
నాప్రాణమును సంగమం బగు సత్ప్రాణ
మాత్మ ప్రాణనిరూఢి యట్టిత్రిపుటి
యందు సద్గురునివాక్యార్థంబు నమ్మి మా
యామలవ్యతిరిక్త మగుచు నాత్మ
ప్రాణలింగాంగమథనసంబంధలీలఁ
దనరఁ బ్రాణాంగములు ప్రసాదములు గాఁగ
మానసేంద్రియములు నంద మగ్నములుగ
నెసఁగుసుఖ మల్పులకు నెద్ది బసవలింగ ! 209

అది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గార్పితశబ్ద మధ్యాత్మ మదియు
నది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గార్పితస్పర్శ మధ్యాత్మనేత్ర
మది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గాత్మస్వరూప మధ్యాత్మదేహ
మది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గార్పితరుచ్య మధ్యాత్మదేహ
మదియు ఘ్రాణ మధ్యాత్మనిర్మాల్యగంధ
మట్టు లది భూత మది దైవ మాగురుండు
అగు ప్రసాదాదిబుద్ధేంద్రియాత్మవిషయ
భరితసుఖ మల్పులకు నెద్ది బసవలింగ ! 210

అది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గార్పితకలిత మధ్యాత్మవాక్కు
అది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గార్పితదాన మధ్యాత్మపాణి
అది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గార్పితాలాప మధ్యాత్మపాద
మది దైవ మాచార్యుఁ డది భూత మిష్టలిం
గార్పితసహిత మధ్యాత్మపాయు
వదియును నుపస్థ యిష్టలింగార్పితంబు
మఱియు నుత్సర్జనక్రియల్ దొరలుచుండఁ
బరగఁ గర్మేంద్రియాత్మకగురుప్రసాద
భరితసుఖ మల్పులకు నెద్ది బసవలింగ ! 211

వినియెడుశ్రోత్రముల్ వినుటయు వినఁబడు
శబ్దజాలంబుఁ దచ్ఛ్రవణసుఖము
పొందెడుత్వక్కను బొందుటయును బొందు
స్పర్శంబులు తదీయసంగసుఖము
కనియెడునేత్రముల్ కనుటయుఁ గాంచురూ
పములు సద్వీక్షణాస్పదసుఖంబు
ఆనెడు జిహ్వయు నానుటయును నాను
రసము తదీయాచరణసుఖంబు

మూర్కొనందగు ఘ్రాణంబు మూరుకొనుట
మూరుకొనుగంధమును దత్సముదితసుఖము
నర్పితముఁ జేసి పొందు మహాప్రసాది
కెసఁగుసుఖ మల్పులకు నెద్ది బసవలింగ ! 212

షట్సలాంతైకవింశత్సహస్రస్వరా
ర్పణము ప్రాణక్రియార్పణమువలన
శ్వాసనిశ్వాసాంగపోషణార్పణమపా
నవ్యాన మరుదర్పణంబువలనఁ
దనుజేష్టధాతువర్ధనముఖార్పణము దా
నసమానపవనార్పణంబువలన
నిష్ఠీవనోన్మేషనిమిషార్పణంబులు
నాగకూర్మసమర్పణంబువలన

క్షుత్పిపాసాదిపరిశిష్టగుణసమర్ప
ణము కృకరదేవదత్తధనంజయార్ప
ణముల నగు దశప్రాణార్పణముల నతని
కెసఁగు లింగార్పణమునన బసవలింగ ! 213

అజినశిరోజశల్యస్నాయుముఖకర
ణార్పణబుద్ధిసమర్పణమున
లాలాస్రమూత్రశుక్లస్వేదమజ్జాము
ఖార్పణము మనస్సమర్పణమున
క్షుత్పిపాసాఖ్యసుషుప్తిసంయోగము
ఖార్పణ తేజస్సమర్పణమునఁ
గలితనాసాశ్వాసగమనాగమననిరో
ధార్పణ వాయుసమర్పణమునఁ
గామముఖ్యమోహాదిసంకలితభయస
మర్పణమ్ము నాకాశసమర్పణమున
నట్టిభూతార్పణంబు నాత్మార్పణమున
నెసఁగు మీప్రసాదంబులు బసవలింగ !

తలపించు మనసును దలఁచుటయుఁ దలంచు
తలఁపులు మఱి సముద్గతసుఖంబు
పలికించు వాక్కును బలుకుటయును బల్కు
పలుకులు తత్సముద్భవసుఖంబు
చరియించు కాయంబు చరియించుట చరింపఁ
దగు సముచ్చయసముద్గతసుఖంబు
చేయు కర్మంబులు సేయుటయును జేయ
నగుచెయ్వులును దన్నితాంతసుఖము
చెలఁగి చెల్లించు నాత్మయుఁ జేతనమును
చేతనాధిష్ఠితక్రియాతీతసుఖము
నర్పితముఁ జేసి పొందును దత్ప్రసాది
కెసఁగుసుఖ మెల్లలకు నెట్లు బసవలింగ !

మున్ను పల్కిన పల్కుచున్న పల్కుఁగఁ గోరు
చున్న వక్తృవ్యసముదితసుఖము
మున్ను ముట్టిన ముట్టుచున్న ముట్టఁగఁ గోరు
చున్న స్పర్శవ్యసముదితసుఖము
మున్ను చనిన చనుచున్న చనఁగఁ గోరు
చున్న గంతవ్యసముదితసుఖము
మున్ను సల్పిన సల్పుచున్న సల్పఁగఁ గోరు
చున్న కర్తృవ్యసంయోగసుఖము
మున్న యెఱిఁగిన యెఱుఁగుచునున్న యెఱుఁగఁ
గోరుచున్న సుబోధ్యప్రచారసుఖము
ప్రబలు నాంతర్యసుఖసమర్పణముఁ జేసి
యెసఁగఁ జెందుఁ బ్రసాదియు బసవలింగ! 216

అచలేంద్రియము శ్రోత్ర మవ్విషయము చంద
మది యింద్రియప్రథమార్పణంబు
నచలేంద్రియము నేత్ర మది గనువిషయంబు
లవి యింద్రియద్వితీయార్పణంబు
నచలేంద్రియమ్ము త్వక్కు చరించువిషయము
లవియు యింద్రియతృతీయార్పణంబు
నచలేంద్రియము ఘ్రాణ మవ్విషయంబులు
నవి యింద్రియచతుష్టయార్పణంబు
రసన యచలేంద్రియంబు చరంబు విషయ
మదియు నటుగూడఁ బంచేంద్రియార్పణంబు
చెందుకొలికియుఁ దా నిచ్చి చెందుకొలికి
నెసఁగ నెఱుఁగఁ బ్రసాదియా బసవలింగ! 217

అచలేంద్రియము వాక్కు వచనము దగఁ జరం
బది యింద్రియత్వాదియార్పణంబు
అచలేంద్రియము పాణి యచలంబు తత్క్రియ
యది యింద్రియత్వాదియార్పణంబు
అచలేంద్రియము పాద మచరంబు తత్క్రియ
యది యింద్రియత్వాదియార్పణంబు
అచలేంద్రియము గుహ్య మచర మయ్యానంద
మది యింద్రియత్వాదియార్పణంబు
మనసు నచలేంద్రియంబు సంస్మరణ మచర
మదియు నటుగూడఁ బంచేంద్రియార్పణంబు
చెందుసుఖమును దా నిచ్చి పొందుసుఖము
నెసఁగువాఁడు ప్రసాదియా బసవలింగ! 218

సర్వాంగములు లింగసన్నిహితంబుగ
లింగంబు నయ్యంగసంగతముగ
ప్రాణంబు లింగానుబంధంబు గాఁగ నా
లింగంబు ప్రాణానుసంగతముగ
లీల నింద్రియములు లింగసంగంబు నా
లింగంబు నింద్రియసంగతముగ
సన్మనంబును లింగసన్నిహితంబుగా
లింగంబుఁ దన్మనస్సంగతముగ
నట్టు లన్యోన్యసౌహృదాహ్లాదభరిత
సమరసానందసత్సుఖసహితహితస
మాహితాన్యోన్యగర్భవిహారణకేళి
నెసఁగువాఁడె ప్రసాదియా బసవలింగ! 219

నీనేత్రలింగసన్నిహితమై నేత్రంబు
లర్పించు రూపలతాంతములను
నీశ్రోత్రలింగసన్నిహితమై శ్రోత్రంబు
లర్పించు శబ్దలతాంతములను
నీఘ్రాణలింగసన్నిహితమై ఘ్రాణంబు
లర్పించు గంధలతాంతములను
నీయంగలింగసన్నిహితమై త్వక్కు దా
నర్పించు స్పర్శలతాంతములను
నీదుజిహ్వయు లింగసన్నిహిత మగుచు
భజన సేయుచు సత్పూజ పత్ర పుష్ప
మట్లు దాల్చును నిర్మాల్య మా ప్రసాది
భక్తి నయనేంద్రియంబుల బసవలింగ ! 220

ముఖ్యరూపార్పణోన్ముఖ మగు లింగస
న్నిహితనేత్రంబులు నిన్నుఁ జొచ్చి
ముఖ్యగంధార్పణోన్ముఖ మగు లింగస
న్నిహితనాసికమును నిన్నుఁ జొచ్చి
ముఖ్యశబ్దార్పణోన్ముఖ మగు లింగస
న్నిహితకర్ణంబులు నిన్నుఁ జొచ్చి
ముఖ్యరసార్పణోన్ముఖ మగు లింగస
న్నిహితరసజ్ఞయు నిన్నుఁ జొచ్చి
ముఖ్యసంస్పర్శనార్పణోన్ముఖితలింగ
సన్నిహితమగు శరీరంబు నిన్నుఁ జొచ్చి
యర్పితముఁ జేసి పొందు సుఖానుభూతి
నెసఁగువాఁడె ప్రసాదియౌ బసవలింగ ! 221

ముఖ్యవాగర్పణోన్ముఖ మగు లింగస
న్నిహితవాగ్వృత్తియు నిన్నుఁ జొచ్చి
ముఖ్యమనోర్పణోన్ముఖ మగు లింగస
న్నిహితమానసమును నిన్నుఁ జొచ్చి
ముఖ్యక్రియార్పణోన్ముఖ మగు లింగస
న్నిహితప్రాణస్థితి నిన్నుఁ జొచ్చి
ముఖ్యమాత్మార్పణోన్ముఖ మగు లింగస
న్నిహితసత్కర్మము నిన్నుఁ జొచ్చి
వ్యక్తసన్మానసార్పణోద్వ్యక్తలింగ
సన్నిహితమానసంబును నిన్నుఁ జొచ్చి
యర్పితముఁ జేసి పొందు సుఖానుభూతి
నెసఁగువాఁడె ప్రసాదియా బసవలింగ! 222

వసువర్ధననిమిత్తవాగ్ధమనోత్థలా
లాతతు ల్భాండంబు లంటెనేని
భిస్సటోత్కటరసోపేతపాకంబుఁ బ
చనవహ్ని యాంహుతిఁ గొనియెనేని
ధరఁ బరదేవతాపరలింగబాహ్యవ్ర
తభ్రష్టులును మఱి తాకిరేని
మశకపిపీలికామక్షికాముఖజంతు
చికురాద్యుపహతులు చెందెనేని
రంధ్రనీరంధ్రభాండవిరచితమేని
యవి నిషిద్ధపాకాన్నముల్ భవసమర్ప
ణార్హములు గావు చూడ ననర్హ మగును
భవము గాదె దలంపఁగ బసవలింగ! 223

ద్రవ్యశ్రవణసంస్మరణదర్శనస్పర్శ
నాదిరుచ్యంతరూపార్పణంబు
పిండితముద్గల పృథుకబళాభ్యంత
రాన్వితభక్ష్యభోజ్యార్పణంబు
శాకరసద్రవ్యషడ్రససూపోద
నాన్యోన్యపరిమిశ్రితార్పణంబు
తత్పదార్థాన్వితతత్ఫలావృతలలి
తాభినియుక్తిసమర్పణంబు
భక్ష్య భోజ్య లేహ్య పానీయ చోష్య ము
ఖానుభవకలాసమర్పణంబు
కొలికి యెఱుఁగకున్నఁ గూడునె లింగాను
భవగుణాఢ్యుఁ డగునె బసవలింగ! 224

మశక భృంగ పతంగ మక్షిక స్పర్శ మా
ర్జాల మూషికముఖాసక్తదృష్టి
వీరవ్రతాచార విరహిత వ్రాత్యాది
ధర్మాన్వితాద్యైకకర్మదృష్టి
పంక్తిభోజనయుక్తపరిజనస్వకుటుంబి
భార్యాప్రసాదాన్నపానదృష్టి
వాక్క్రియామానసవ్యాప్తవిజ్ఞాపనా
సావధానేతరసత్త్వదృష్టి
చేత నుపహతంబు చెందని మఱి యన్య
మిశ్రితంబు గాని మీఁదు పూని
శుభతరప్రసాదసువిధాని గాక గో
ప్యప్రసాది యగునె బసవలింగ! 225

పాకశాకములలోఁ బడు నాని తీపులు
ఖండితస్వరములు గదియనీక
ద్రవ్యాకృతులు దగఁ దల్పి లోఁజాలక
నడపాటురూపులు సుడియనీక
నానాన్నపానపునస్స్పర్శనభ్రాంతి
పొందిడి చేముట్టి పొసఁగనీక
తద్రుచి కబళింపఁ దనుఁ జొచ్చి కడువడిఁ
బోవు నోరూరులఁ బారలనీక
మనసు నింద్రియవృత్తిచే మరగనీక
చిత్త మింద్రియములచెంతఁ జేరనీక
నీకు నర్పించి భోగించునియతి లేక
యొసఁగునె ప్రసాదసౌఖ్యంబు బసవలింగ ! 226

ద్రవ్యముల్ బంధించుతఱి మఱి
వానిపై నత్తి గావించక రిత్తనోరు
నములక పెదవులు నాకక యుమియక
చప్పరించక లాల దప్పిగొనక
చిఱుదగ్గు దగ్గక జిహ్వా సారింపక
పెదవులు దడపక యుదరనీక
గ్రుక్కిళ్ళు మ్రింగక బిక్కుఁ బిల్వక యాత్మ
జీవసంయోగముఁ జెడఁగనీక
పరగ నర్పించి సంభ్రమపడక దుడుకు
పడక పరికించకయు నిజాపాదిగుణము
నెద్ది చూపక వర్తించుబుద్ధిమంతు
నెసఁగును బ్రసాదసౌఖ్యంబు బసవలింగ ! 227

శుద్ధాన్నపానముల్ శోధించి శోధించి
స్వామికి వడ్డించుచట్టువంబు
భవ్యమై విలసిల్లు భస్మసంస్పర్శగాఁ
బ్రాణేశునకు నిడుపళ్లెరంబు
కర్తకుఁ ద్రద్రుచుల్ కడిచేసి కడిచేసి
కుడుపుతన్మానసాంగుళపుటంబు
నాదునాలుక నాల్క నాదునాలుక నాల్క
నాదునాలుక నాల్కనాఁ జరించి
పానఁగఁ ద్రద్రుచులెల్లను బొందుపఱిచి
సంతసిలి నిన్ను మనమున సంస్మరించి
యసమబుద్ధిని నిష్టలింగార్పణాది
వసతిఁ గనినఁ బ్రసాదియౌ బసవలింగ! 228

లింగసాన్నిధ్యంబు లింగాంకితంబేని
స్వామిభృత్యత్వంబు చర్యయేని
సతతపుణ్యోద్యుక్తి సముచితక్రియయేని
యింద్రియస్పర్శంబ యిష్టమేని
అవధానసవిధాన మభ్యర్చితంబేని
విషయస్వతంత్రత విషయమేని
కలితప్రసాదభోగ మ్మనుశ్రుతమేని
నినుఁ జొచ్చి యునికియ మనికియేని
నట్టిపూజకునకుఁ గడు దిట్టమైన
ఫలము గల్గును దప్పక సలలితముగ
గాధ సెందక తా భవాంబోధి విడిచి
పరమసుకృతంబుఁ జెందఁడె బసవలింగ! 229

ఇప్పుడే శబ్దంబు లిచ్చి నీ కది నీవ
తెచ్చి శ్రోత్రములచే నిచ్చి యిచ్చి
యిప్పుడే స్పర్శంబు లిచ్చి నీకది నీవ
తెచ్చి దేహంబుచే నిచ్చి యిచ్చి
యిప్పుడే రుచ్యంబు లిచ్చి నీ కది నీవ
తెచ్చి రసజ్ఞచే నిచ్చి యిచ్చి
యిప్పుడే వాసన లిచ్చి నీ కది నీవ
తెచ్చి ఘ్రాణంబుచే నిచ్చి యిచ్చి
యిప్పు డెవ్వియుఁ దలఁపఁగ నిచ్చి యట్టి
యెడను మఱి దృష్టిఁ గొనకయు గడన చెడక
యెంతయును నర్పణముఁ జేసి యింపు మీఱ
నెసఁగక ప్రసాదఫల మానె బసవలింగ! 230

చూపక చూడక చూపక చూచిన
కనులపండువుగను గలక లేక
వినుపింపక వినక వినుపింప వినినను
వీనులకును మఱి వెలుపు లేక
అంటింప కంటక యంటింపకుండిన
చేతుల దండిగా భీతి లేక
యానింప కానక యానింప కానిన
జిహ్వకు దట్టమై చింత లేక
వీఁక మూరుకొనక వీఁక మూర్కొనిన ఘ్రా
ణంబు పండువుగ భయంబు లేక
యన్నివిషయములను బన్నుగాఁ దెలిసిన
వాఁడుపో ప్రసాది బసవలింగ! 231

ఆరాధ్యదేవున కర్థార్పణముఁ జేసి
కర మర్థి లింగజంగమముఁ బడసి
నలి దేశికునకుఁ బ్రాణసమర్పణం బాదిఁ
గావించి ప్రాణలింగంబు వడసి
మొదల శ్రీగురులింగమునకు శరీరార్ప
ణముఁ జేసి కడుఁ బ్రసాదమును బడసి
యాచార్యవిభునకు నాత్మార్పణముఁ జేసి
భవ్యజీవన్ముక్తిఁ బడసి యట్ల

చనక ప్రాణంబు నర్థంబుఁ దనశరీర
మును నిజాత్మ వంచింపక మొదలుఁ జుట్టి
మగుడఁ గాక తత్తనలాభమానసునకుఁ
బొసఁగను బ్రసాదసుఖ మబ్బు బసవలింగ! 232

శ్రీగురుమూర్తి కర్పించినతను వన
ర్పితభోగమునకునై పెట్టెనేని
ఆరాధ్యదేవున కర్పితం బైన ప్రా
ణం బనర్పితవిధి నడిచెనేని
ఆరాధ్యదేవున కర్పితం బైన మా
నస మనర్పితముగా నెసఁగెనేని
తద్దేశికేంద్రార్పితం బైన సర్వార్థ
ము లనర్పితములుగాఁ బొలసెనేని

అరసిచూడ నీవును మఱి యాప్రసాది
యును బ్రసాదోక్తిభక్తుల మనుచు మఱియుఁ
జెలఁగి యర్పింప భోగింప సిగ్గు గాదె
భక్తవత్సల! సదయాత్మ! బసవలింగ! 233

ఆత్మ స్వతంత్రలింగానర్పితం బను
కాలాహి కాహుతి గాకయుండ
నంగ మయ్యంగలింగానర్పితం బను
దండపాణ్యుద్వృత్తిఁ దాఁకకుండఁ
ప్రాణంబు ప్రాణలింగానర్పితం బైన
మానసార్పితమున మగ్న మగుచు
దంభోళిహతిచేతఁ దలఁగక యుండ శై
లంబుభాతిని నిబ్బరంబు గాఁగ
నయ్య భవదీయగర్భాబ్ధిశయ్య నునిచి
సావధానార్పణంబుల నవధరించి
నీదుభవ్యప్రసాదంబునియతిఁ గనక
బ్రతుకు గలదె ప్రసాదికి బసవలింగ ! 234

దేశికసాంగోపదేశమంత్రంబు ప్ర
సాదము శబ్ద మాత్రయము గాఁగ
నారాధ్యదేవు శ్రీహస్తమస్తకయోగ
మది ప్రసాదస్పర్శ మాది గాఁగ
నాచార్యవిభుని కృపావలోకనకుఁ బ్ర
సాదావలోకనాస్పదము గాఁగ
సద్గురులింగప్రసాదానుభూతికి
ఘనతరం బైనట్టి జనని గాఁగ
నాప్రసాదికి నాదిగా నట్లు చనక
గురుచరేశ్వరసాదసంస్మరణ గాక
యితర మయినట్టి వేఱె సద్గతులు మఱియు
బ్రతుకు గలదె ప్రసాదికి బసవలింగ ! 235

స్వామి నీ నేత్రప్రసాదదీపప్రభా
సంగతి నేత్రపతంగ మడఁగు
స్వామి నీ శ్రోత్రప్రసాదసుషిరనాద
సంగతి శ్రోత్రభుజంగ మడఁగు
స్వామి నీ నాసాప్రసాదచంపకగంధ
సంగతి నాసికాభృంగ మడఁగు
స్వామి నీ కాయప్రసాదయోగస్పర్శ
సంగతిఁ గాయమతంగ మడఁగు

బరమపావన ! మీ ప్రసాదరసభుక్తి
యాప్రసాదజిహ్వ యను మత్స్యం బడంచుఁ
గాన యితరదుర్విషయంపుక్రాంతి నణఁచు
భక్తివిషయేంద్రియంబులు బసవలింగ ! 236

నను(గాని వినవికర్ణములు గదా యని
శ్రోత్రప్రసాదంబుఁ జొనుపకున్న
నను(గాని పొందనితనువు గదా యని
కాయప్రసాదంబు గ్రమ్మకున్న
నను(గాని చూడనికనులు గదా యని
నేత్రప్రసాదంబు నెఱపకున్న
నను(గాని యాననినాల్క గదా యని
జిహ్వాప్రసాదంబు చేర్పకున్న

"గంధ మన్యథా" యనఁగ నీఘ్రాణ మిదియ
యనుచు ఘ్రాణప్రసాదంబు నినుపకున్న
నీవు నావాఁడ వీఁ డని ప్రోవకున్న
బ్రతుకు గలదె ప్రసాదికి బసవలింగ ! 237

నీకు వాహనములై నీలోనఁ జరియించు
మచ్చికఁ గనులు సమర్పణముగ
నీకుఁ బాదములునై నీలోన నడుచు న
య్యడుగుల కడుగు ల్సమర్పణముగ
నీకుఁ బర్యంకమై నీలోన శయనించు
నూర్పునిశూర్పులును సమర్పణముగ
నీకు గద్దియ యయి నీలోనఁ గూర్చుండు
మాటకు మాట సమర్పణముగఁ

బంచభోజనాకృతినుండి పంచవిషయ
మానితసుఖార్పణముగ నీలోన మఱియు
నణఁగు చిత్తప్రసాదదేహస్థుఁ డొందు
బయటిసుఖములు దలఁచునే బసవలింగ ! 238

లింగపీఠం బగు నంగంబు ప్రాణేంద్రి
యము మజ్జనము చేసి యలవరించు
గంధపుష్పాదులు ఘ్రాణేంద్రియం బద్ది
యెక్కించి ధూపంబు లిచ్చు వరుస
నేత్రేంద్రియం బది నీరాజన మిడఁగ
రసనేంద్రియం బూగి రసము లిచ్చు
వాగింద్రియము నిన్ను వర్ణించు శ్రోత్రేంద్రి
యము వినుపించు గుణాంకనములు

నట్లు యిష్టలింగార్చనం బాచరించి
చను తదీయప్రసాదాత్మసౌఖ్య మొంది
యవిరతేంద్రియస్వాధీనుఁ డగుఁ బ్రసాది
భక్తినియతేంద్రియంబుల బసవలింగ ! 239

లోపంబు లేక విజ్ఞాపింపకున్నఁ ద
ద్విజ్ఞాపనము నీవు వినకయున్న
నంటినరూపంబు లర్పింపకున్న నీ
వటులు నేత్రేంద్రియ మంటకున్న
నానక రుచు లవధానినై యీకున్నఁ
బూని తద్విషయాదు లానకున్న
నవియును నిన్నుఁ బోల్చి యనుభవింపకయున్న
నీవు నిట్టులు గరుణింపకున్న
నాప్రసాదియు నీవ నా కనకయున్న
నేను నీ కని నీవును బూనకున్న
సమము గాక యిరువురదోషంబు కలిమి
బలిమి నర్పించుఁ గైకొన బసవలింగ ! 240

వినఁగ నేరఁడు నీవు వినిపింపక ప్రసాది
వినిపింపకయు నీవు విన వతఁడు
ముట్టనేరఁడు నీవు ముట్టింపక ప్రసాది
ముట్టింపకయు నీవు ముట్ట వతఁడు
చూడనేరఁడు నీవు చూపింపక ప్రసాది
చూపింపకయు నీవు చూడ వతఁడు
నాననేరండు నీ వానింపక ప్రసాది
యానింపకయును నీ వాన వతఁడు
దావి గొన రట్లు నీవు నతండు గాన
ప్రతులు నిరువురు నన్యోన్యవర్తనముల
చంద మెఱుఁగక యిరువురు పొందువడక
యెసఁగునె ప్రసాదసుఖములు బసవలింగ ! 241

వినుపింపకయు తాను వినఁగరా దెవ్వియు
వినకయు వినుపింప వినఁగరాదు
చూచి చూపకయున్నఁ జూడఁగా దెవ్వియుఁ
జూడక చూచియుఁ జూడఁదగదు
ముట్టి ముట్టింపక ముట్టరా దెవ్వియు
ముట్టక ముట్టింప ముట్టఁగాదు
మూర్కొని యీకున్న మూర్కొన్నఁ గాదు మూ
ర్కొనక యిచ్చినను మూర్కొనఁగరాదు
యారగించి యీకుండిన నారగింప
కిచ్చినఁ గొనఁగరాదు పంచేంద్రియాదు
లైనవిషయముల్ చేకొని యవధరింప
కెసఁగఁగఁ బ్రసాదిధర్మంబు బసవలింగ ! 242

చూడ కర్పించినఁ జూడ్కులఁ దనియవు
చూచి యర్పించినఁ జూడ వీవు
ముట్ట కర్పించిన మును చెందనీయవు
ముట్టి యర్పించిన ముట్ట వట్టు
వినక యర్పించిన వీనులఁ దనియవు
విని సమర్పణ సేయ వినవు నీవు
నాన కర్పించిన నాజిహ్వఁ దనియవు
యాని యర్పించిన నాన వట్టు
ఘ్రాణమును సమర్పించు వేడ్కయు మనమున
నింద్రియముల నమ్మఁగఁజాల కెట్టు లనక
పొందక యొల్లఁ బొందినఁ బొందియుఁ బొందు స్వాను
భవసుఖం బిట్టులకు నొద్ది బసవలింగ ! 243

తననేత్రములఁ దనమనసు నేత్రములు నీ
నేత్రంబులందు నిర్ణీత మయ్యెఁ
దనశ్రోత్రములఁ దనమనసు శ్రోత్రములు నీ
శ్రోత్రంబులందు విశ్రుతము లయ్యెఁ
దనఘ్రాణమును దనమనసు ఘ్రాణములు నీ
ఘ్రాణంబునందు సంక్రమణ మయ్యెఁ
దనజిహ్వయును దనమనసు జిహ్వయును నం
గము భవజ్జిహ్వాంగకలిత మయ్యెఁ
గాన తత్సమర్పణ మౌనుఁగాక యనుచు
ననక నినుఁ జొచ్చియును సోహ మనక యలరు
నవ్యయాతీతుఁ డైన దివ్యప్రసాది
కెనఁగుసుఖ మల్పులకు నెద్ది బసవలింగ! 244

నీకు నర్పించియు నిను ముట్టఁ దను ముట్ట
ముట్టింప ముట్టింప ముట్టు నవియు
నీకు నర్పించియు నిను వినఁ దను విన
వినుపింప వినుపింప వినెడి యవియు
నీకు నర్పించియు నినుఁ జెప్పఁ దనుఁ జెప్పఁ
జెప్పింపఁ జెప్పింపఁ జెప్పు నవియు
నీకు నర్పించియు నినుఁ జూడఁ దనుఁ జూడఁ
జూపంగఁ జూపంగఁ జూచు నవియు
నర్పితముఁ జేసి తననిజాపాంగసాంగ
ములను బ్రత్యంగములు దాల్చి ముట్టినట్లు
తలఁచి యర్పించు నిన్నును దన్ను స్వాను
భావసూక్ష్మప్రసాది దా బసవలింగ! 245

అధిపు నుద్దేశించి యర్ఘ్యోదకము లిచ్చు
తటి మీఁదుపోవునె త్రావకున్న
భూతేశునకు దివ్యపుష్పముల్ పెట్టుమూ
త్రాణఁ బోవునె మీఁదు తాల్పకున్న
కర్త నుద్దేశించి గంధంబుఁ జదిమిన
ప్పుడు మీఁదుసోవునె పూయకున్న
స్వామి నుద్దేశించు శాకపాకములు ని
వేదన యీనె యర్పించకున్న
ననుచుఁ బొందుగ శైత్యాదు లన్నివిషయ
మిశ్రితేంద్రియములచేత మీఁదుపోవ
ముట్టునే నీవు ముట్టకమును ప్రసాది
పట్టునో యిచ్చునో కొనునో బసవలింగ ! 246

శబ్దక్రియార్పణాసక్తి సల్లింగక
ర్ణములఁ బ్రసాదికర్ణములఁ జొచ్చి
రూపక్రియార్పణారూఢి సల్లింగనే
త్రములఁ బ్రసాదినేత్రములఁ జొచ్చి
స్పర్శార్పణక్రియాభ్రాంతి సల్లింగకా
యమునఁ బ్రసాదికాయంబుఁ జొచ్చి
రససమర్పణకళారమణ సల్లింగర
సజ్ఞఁ బ్రసాదిరసజ్ఞఁ జొచ్చి
యీసమర్పణభావమం దేకదృష్టి
నిలిపి తద్విషయమ్ములు సలలితముగఁ
దెలిసి వర్తించువానికి ధీసయుక్తి
కెనఁగు ముక్తిసుఖంబులు బసవలింగ ! 247

అన్యోన్యకాయస్థమై పరకాయప్ర
　　వేశస్థితి నొడఁగ్లు వీడుపడక
ప్రాణప్రతిష్ఠానుబంధలీలాచార
　　విస్ఫూర్తిఁ బ్రాణముల్ వీడుపడక
యర్పితతనుకృతాయతసంగతిఁ బ్రసాద
　　వివిధోదనాదులు వీడుపడక
భరితావధానానుభవనిరంతరరతి
　　విషయేంద్రియంబులు వీడుపడక

పరశివవిభూతి సుఖపరంపరవితాన
విలసితోద్దామభావముల్ వీడుపడక
సమయగతలింగ లింగప్రసాదమథన
మెసఁగునె ప్రసాదభావన బసవలింగ ! 248

అగు నిర్వురకును నన్యోన్యేంద్రియంబు ల
　　న్యోన్యభాజనములై యవధరింప
నగు నిర్వురకును నన్యోన్యేంద్రియంబు ల
　　న్యోన్యహస్తంబులై యాదుకొనఁగ
నగు నిర్వురకును నన్యోన్యేంద్రియంబు ల
　　న్యోన్యవక్త్రంబులై యనుభవింప
నగు నిర్వురకును నన్యోన్యేంద్రియంబు ల
　　న్యోన్యేంద్రియంబులై యనుమతింప

నగు నిరువుర కన్యోన్యేంద్రియముల మిశ్ర
మముల నన్యోన్యగర్భగేహములు గాఁగఁ
దినుట లింగంబుఁ దత్ప్రసాదియు మథించు
భావసూక్ష్మంబు లెట్టివో బసవలింగ ! 249

శబ్ద మోగిరము ప్రసాది శబ్దంబు ప
ళ్ళైరము యుష్మచ్ఛ్రోత్రలింగమునకు
స్పర్శ మోగిరము తత్సర్వాంగగతియుఁ బ
ళ్ళైరము తృతీయాంగలింగమునకు
ధర్మ మోగిరము తద్ఘ్రాణంబు దాను ప
ళ్ళైరము భవద్ఘ్రాణలింగమునకు
రస మోగిరంబు తద్రసనాంగ మదియుఁ బ
ళ్ళైరము నీ రసనాంగలింగమునకుఁ

జూపు తా నోగిర మ్మది రూపు మీఁకు
నయనలింగంబు గాఁగ మనంబుచేత
నర్పణముఁ జేసియును నింద్రియములు తనకుఁ
బళ్ళైరము గాఁగ భోగించు బసవలింగ ! 250

గురులింగజంగమాకుంఠితోపాస్తిఁ బా
ల్పడు స్వామిభృత్యసంబంధితనువు
సహజైకలింగనిష్ఠామహిష్ఠతఁ బాలు
పడు వీరభక్తిసంబంధిమనసు
విరచితానుశ్రుతాచరణైకభావన
సంధిల్లు శరణసంబంధిబుద్ధి
బాహ్యాంతరార్పితగ్రాహ్యప్రసాదసం
బంధమా నింద్రియపంచకంబు
ప్రాణలింగప్రమథనసంబంధి యమరుఁ
బ్రాణలింగైక్యసుఖితమాంగాత్మమధ్య
సర్వసంబంధి లింగప్రసాది యనఁగఁ
బడును షట్స్థలసంబంధి బసవలింగ ! 251

నీవు చూడఁగఁ జూచు నీవు నూకఁగ నూకు
చూపులు రూపులు రూపవితతి
నీవు మూర్కొనఁ గొను నీవు నూకఁగ నూకు
ఘ్రాణంబు ఘ్రాణదుర్గంధచయము
నీవు వినఁగ విను నీవు నూకఁగ నూకు
శ్రవణముల్ శబ్దాదిశబ్దచయము
నీ వానఁగా నాను నీవు నూకఁగ నూకు
రసనయు రసము నీరసమునట్లు
నీవు పొందంగఁ బొందును నీవు నూక
గరిమ దక్కఁగ నూకును గఠినములను
నిష్టలింగప్రసాదమ్ము నెఱుఁగువాని
కెనఁగు సిద్ధనిషిద్ధముల్ బసవలింగ! 252

గంధ మైనను నీవు గంధింపకున్న దు
ర్గంధంబు గాక సుగంధ మగునె
రూప మైనను నీవు రూపింపకున్న న
రూపంబు గాక సురూప మగునె
శబ్ద మైనను నీవు చని వినకున్న న
శబ్దంబు గాక సుశబ్ద మగునె
రుచ్య మైనను నీవు రుచియింపకున్న న
రుచ్యంబు గాక సురుచ్య మగునె
యట్టులే యుండఁగా నెవ్వఁడైన నా ప్ర
సాది తెలియఁడె మఱి సుగంధాదిచయము
నేలపొందఁడు సద్గంధ మెఱిఁగినట్టి
ప్రాణలింగాంగి జగమున బసవలింగ! 253

కాని దుర్గంధముల్ కావని తెలియఁగా
నంతనే పొందు ననర్పితములు
కాని కుశబ్దముల్ కావని తెలియఁగా
నంతనే పొందు ననర్పితములు
కాని కురూపముల్ కావని తెలియఁగా
నంతనే పొందు ననర్పితములు
కాని నీరసములు కావని తెలియఁగా
నంతనే పొందు ననర్పితములు
అయిన గంధాదులైనఁ గావని యెఱుంగు
నంతలోననె పొందు ననర్పితములు
కావనంగఁ గొననగును గైకొనంగ
భావసంశుద్ధి గాదె యో బసవలింగ ! 254

అయిన సుగంధాదు లర్పింపఁ గాని య
నర్పితదోషంబు నది యొకండు
గైకొనరాని దుర్గంధాదు లానిన
యపవిత్రదోషంబు నది యొకండు
పొందక పొందెడు పొందెఱుంగక పొందు
నజ్ఞానదోషంబు నది యొకండు
నవుఁ గా దనుట భ్రాంతి యగుచుఁ దా నటు పొందు
నద్వైతదోషంబు నది యొకండు
నిన్నుఁ బొంది వర్తింపక దన్ను మఱచి
మఱవ కర్పితములు నిష్ఠ మరగియున్న
నాస్వాయంకృతదోషంబు లవియు నాల్గు
నెసఁగ నిటు పొందవు ప్రసాది బసవలింగ ! 255

భవదభిషేకాంబుపార్శ్వధారోపరి
సలిలపరంపరాసలిలసమితి
భవదీయపూజనాప్రసవపార్శ్వోపరిఁ
బ్రసవపరంపరాప్రసవచయము
యుష్మదర్పితసిక్థయుక్తపార్శ్వాంతర
సిక్థపరంపరాసిక్థవితతి
యుష్మదీయసమర్పితోద్యద్రసక్రాంత
రంజితసద్రసప్రకరమునను

స్వామి నిను ముట్టినదియ ప్రసాద మాఁ బ్ర
సాదమిశ్రిత మదియ నివేదితంబు
గాఁగఁ గైకొని తక్కుముఖ్యప్రసాది
భావసూక్ష్మం బదెట్టిదో బసవలింగ ! 256

శ్రోత్రప్రసాదంబు శ్రోత్రంబునకుఁ దక్క
నన్యేంద్రియముల కనర్పితములు
నేత్రప్రసాదంబు నేత్రంబునకుఁ దక్క
నన్యేంద్రియముల కనర్పితములు
ఘ్రాణప్రసాదంబు ఘ్రాణంబునకుఁ దక్క
నన్యేంద్రియముల కనర్పితములు
జిహ్వాప్రసాదంబు జిహ్వకునే తక్క
నన్యేంద్రియముల కనర్పితములు

అట్ల నీప్రసాదంబు నా ప్రసాది
త్వక్కునకుఁ జెందియు ననర్పితంబు గాఁగఁ
జను తదేకప్రసాదికి ఘననియమము
భక్తివిషయేంద్రియములకు బసవలింగ ! 257

అసమర్పిత మనర్పితాన్నపానాదిసం
యుతభోగి ఘనకిల్బిషోపభోగి
తావకమాత్రాన్నధవళార్పితసుభోగి
యతఁడు మిశ్రితప్రసాదైకభోగి
అర్పితార్పితభోగి యఖిలేంద్రియజ్ఞాన
సర్వస్వతంత్రప్రసాదభోగి
యుభయార్పితద్వయాభ్యుదఫలగ్రసనవి
సరభోగి సూక్ష్మప్రసాదభోగి
అర్పితానర్పితప్రక్రియాక్రియాఫ
లాఫలార్పితలింగగర్భాబ్ధిపూర
వ ప్రసాదైకమూర్తి మహాప్రసాది
పరమసమ్మార్జితవిషాది బసవలింగ !

అంగలింగానర్పితాన్నపానాదులు
ముట్టినఁ దప్పని ముట్టకైన
ఆత్మలింగానర్పితాన్నపానాదులు
ముట్టినఁ దప్పని ముట్టకైన
మహితసల్లింగసమర్ప్యద్రవ్యాదులు
ముట్టి సహింపక ముట్టకైన
నిష్టలింగసమర్పితేతరవస్తువుల్
ముట్టియెఱుంగక ముట్టకైన
ముట్టకుండినఁ జాలుఁ జే ముట్టి నీవ
పెట్టఁగల్గుప్రసాదంబు లెట్టులైన
నవిరళేంద్రియములకు సమర్పితముగఁ
బరువడి గ్రహింపుచుండును బసవలింగ !

నీకు శుద్ధాన్నపానీయాదు లర్పింప
శుద్ధప్రసాదసంసిద్ధి కలిగి
శుద్ధప్రసాదసంసిద్ధార్పణము చేసి
తత్ప్రసిద్ధప్రసాదంబు వడసి
తత్ప్రసిద్ధప్రసాదము సమర్పణ చేసి
సుప్రసాదాత్మైకసుఖము వడసి
సుప్రసాదాత్మైకసుఖసమర్పణ చేసి
భరితసుఖాతీతపథము వడసి
యాసుఖాతీతపథము లయ్యర్పణములుఁ
దన్ను నర్పించి తన్నైకా నిన్నుఁ బడసి
యీప్రసాది మహార్పితం బౌ ప్రసాది
నెసఁగ నేమని వర్ణింతు బసవలింగ ! 260

తాను ముట్టక పదార్థములైన నర్పింప
నవి నీవ చే ముట్టి యవధరింపు
తను ముట్టనీక తద్ద్రవ్యమ్ము లర్పింప
నవియు ముట్టఁగ నేర్చి యవధరింపు
తాను నీలోఁ జొచ్చి తత్సమర్పణ సేయ
నతని నీలో నుంచి యవధరింపు
తనలోన నిను నిడి తత్సమర్పణ సేయ
నతని నీలో నిడి యవధరింపు
తత్ప్రసాదార్పణము చేసి తన్ను నీకు
నర్పణము సేయ నీవును నందుఁ జొచ్చి
యాప్రసాదంబు నిడఁ దన్మహాప్రసాద
మెసఁగ నర్పించుఁ దప్పక బసవలింగ ! 261

ఇతరవాహనముల నెట్టు లర్పించును
దా వాహనం బైన తత్ప్రసాది
గమకింప మఱి పాదుకము లెట్టు లర్పించుఁ
దాఁ బాదుకము లైన తత్ప్రసాది
యొందుపీఠములఁ గూర్చుండ నె ట్లర్పించుఁ
దాఁ బీఠ మైయున్న తత్ప్రసాది
శయనింపఁగా వేఱె శయన మె ట్లర్పించుఁ
దా శయ్య మైయున్న తత్ప్రసాది
గాన యర్పించి యర్పింపకయును దండ
నణఁగియుండును భావలింగార్పణంబు
కొలికి మెఱిఁగి యర్పించి కైకొను ప్రసాది
భావసూక్ష్మం బదెట్టిదో బసవలింగ! 262

నీకు నిషిద్ధాన్నపాకాదు లర్పింప
నతనిని వివిధభవాబ్ధి నణఁతు
శుద్ధాన్నములు తన క్షుత్పిపాసార్థమై
యర్పింప నుభయకర్మాబ్ధిఁ ద్రోఁతు
తా ద్రవ్యములు యుష్మదర్చోపచారార్థ
మర్పింప సుకృతకర్మాబ్ధిఁ దేల్తు
వవియు సాక్షాద్భవదభ్యవహారార్థ
మర్పింప నీదుగర్భాబ్ధి మనుతు,
వట్లు గా కర్పితనిరూపితాభిమతను
ఖావలులు భవదీయసుఖార్థముగ స
మర్పణము సేయఁ ద్వత్ప్రసాదాంచితాను
భవసుఖాంబుధి నోలాడు బసవలింగ! 263

అగుఁ బ్రసాదంబు వస్త్రాభరణాదులు
నర్పితావధి సయోగాంత మగుట
అగుఁ బ్రసాదము పాదుకాసనశయ్యలు
నర్పితావధి సయోగాంత మగుట
అగుఁ బ్రసాదము వాహనాందోళికాదులు
నర్పితావధి సయోగాంత మగుట
అగుఁ బ్రసాదమ్ము శస్త్రాస్త్రదండాదులు
నర్పితావధి సయోగాంత మగుటఁ
దద్వియోగసమర్పణాంతస్తదీయ
దర్శనస్పర్శనాన్వితధారణాంత
సుఖపరంపర లర్పించు సుప్రసాది
కెసఁగుఁ దత్ప్రసాదసుఖంబు బసవలింగ! 264

అర్పితార్హము లగు నన్నపానాదుల
కును శుద్ధి గావించు కొలికి యెట్లు
లభిమంత్రజలముల నగు శుద్ధి యందమా
యామంత్ర మేమిట నయ్యె శుద్ధి
ఆప్రసాదము ముట్ట నగు శుద్ధి యందమా
మును ప్రసాదముఁ గాని ముట్టఁదగదు
ఆద్రవ్యశుద్ధి చేయఁగ వేఱె యాయింద్రి
యములు ప్రసాదేంద్రియంబు లవును
గాన భాండపాత్రస్థము ల్గాకమున్న
తత్పదార్థవిశుద్ధియా దారిఁ గోరి
యవియె తగఁ దెచ్చి యర్పించి యనుభవించు
భావ మెఱుఁగఁ బ్రసాదియా బసవలింగ! 265

రూపార్పితవ్రతారూఢియుఁ బాడియుఁ
గరికాలవిభునంద కానఁబడియె
రుద్రార్పితక్రియారూఢంబు గూఢంబు
చెన్నయ్యయందునఁ జెప్పఁబడియె
కడికడి కర్పించు గతియును మతియును
జేడన్నయందునఁ జూడఁబడియె
సహభాజనక్రియాసక్తియు భక్తియు
వీరచోళునియందు వినఁగఁబడియె

నానరేంద్రుద్రవతంబు నాయయ్యజిహ్వ
యాగణాధీశుహస్త మాయప్పమతియుఁ
గూడ నొక్కటియైన భక్తునకుఁ గాక
యెసఁగ నితరుల కౌనె యో బసవలింగ ! 266

తా నెఱిఁగి యర్పించుద్రవ్యరూపము భేద
మెఱుఁగ కర్పించిన యెఱుఁగు దీవు
తా నెఱిఁగి యర్పించుద్రవ్యసురుచి భేద
మెఱుఁగ కర్పించిన నెఱుఁగు దీవు
తా బాహ్యమున సర్పితము సేయురూపంబు
లంతరార్పణ సేయ నంటె దీవు
తా నంతట సమర్పితము సేయు రుచులను
బాహ్యార్పణము సేయఁ బడయు దీవు

అంద రూపనిరూపపదార్థరుచియు
నొప్పు నేకాంతరార్పణం బొల్ల వీవు
గాన పరికింపఁ దత్సమజ్ఞానభేద
మెసఁగ నెఱుఁగఁ బ్రసాదియా బసవలింగ ! 267

నానాస్వరూపప్రధానార్పణము దాన
గాన ప్రధాన మంగమున కాది
యా నిరూపాంగసమర్పణ మైనట్టి
యంగము తత్ప్రధానార్పణంబు
తత్ప్రధానాంగవిధానత నంగేత
రప్రధానవిధానరహితయుగళి
యాప్రధానము ప్రాణ మంగ మంగము ప్రధా
నార్పణాంగప్రధానాభిరతికి
నాప్రధానరూపము లుభయార్పణంబు
లాన్నిరూపసుఖంబు లేకార్పణంబు
గాన యుభయార్పణము పరిజ్ఞానమతికి
నెసఁగుఁ దత్ప్రసాదసుఖము బసవలింగ! 268

భవదీయమృష్టంబు భాండావశిష్టంబు
గుండ భోగింప నేగురుఁడు చెప్పె
యుతవిషామృతసమస్థితి ననర్పితము మి
శ్రితమును గడు సమర్పితము గాదె
అన్యదైవాన్యమంత్రాన్యమార్గాన్యోన్య
సంకరదోషము సమము గాదె
తమలింగమునకు మీఁదట మఱి వడ్డింప
నంద్రు లింగమునకే యలఁతి వచ్చు
నంతరార్పణమే కాని వింత లేక
మొదవుక్షీరంబులోపల మొదవు చిక్క
నగునె సద్భావ్యాపోషణ మైనలింగ
పరమకృపఁ బొందినఁ బ్రసాది బసవలింగ! 269

దేవ రీక్షింపుచో దృష్టిగోచరము లౌ
విమలార్పణముల సిద్ధములరూపు
లయ్య వడ్డింపుచో హస్తాన్వితంబు లౌ
సిద్ధోదనాంతరసిక్థవితతి
జియ్య యందిచ్చుచో జిహ్వావగతము లౌ
కబళాంతరాళసిక్థముల రుచులు
స్వామి వడ్డించుచో సద్భావయుతము లౌ
నిద్ధేంద్రియజ్ఞాన మిష్టసుఖము
లర్పితములలో నీదుతృష్ణార్తిభయజ
రారుజాదిఘోరాస్త్రశస్త్రములు దాల్చి
జోక చెడకయ తస్కరలోక మెల్ల
వెస జయింపఁ బ్రసాదియౌ బసవలింగ ! 270

వీనులచేత నీ వీనులచేతికి
నందించు శబ్దంబు లౌ ప్రసాది
కన్నులచేత నీ కన్నులచేతికి
నందిచ్చు రూపంబు లౌ ప్రసాది
ఘ్రాణంబుచేత నీ ఘ్రాణంబుచేతికి
నందిచ్చు గంధంబు లౌ ప్రసాది
నాలుకచేత నీ నాలుకచేతికి
నందిచ్చు రసషట్క మౌ ప్రసాది
చేఁతచేతను దన్ను నీ చేతిచేఁతఁ
దన్నుచే స్పర్శ లందిచ్చుఁ దత్ప్రసాది
యవధరించు నీవు గానెడు నాప్రసాద
మసదృశేంద్రియమ్ములఁ దాను బసవలింగ ! 271

శబ్ద మర్పించుచో శ్రవణంబు లటుగూడఁ
జేతులై యర్పణ సేయఁడేని
రూపు లర్పించుచోఁ జూపు లన్నియుఁగూడఁ
జేతులై యర్పణ సేయఁడేని
గంధ మర్పించుచో ఘ్రాణ మంతయుఁగూడఁ
జేతులై యర్పణ సేయఁడేని
రసము లర్పించుచో రసన యంతయుఁగూడఁ
జేతులై యర్పణ సేయఁడేని
పరగ లింగాంగసంయోగభావ మొప్పఁ
జెలఁగి విషయాదు లర్పణ సేయఁడేని
మానసేంద్రియరసములు పూనెనేని
యొసఁగునె ప్రసాదసౌఖ్యంబు బసవలింగ! 272

స్వామి! త్వదీయ ప్రసాదివీనులకు నీ
వీనులు వీనులై వినికి నొసఁగు
సదయాత్మ! యుష్మత్ప్రసాదికన్నులకు నీ
కన్నులు కన్నులై కాన్పు లొసఁగు
శరణవత్సల! నీ ప్రసాదిరసనకు నీ
రసనయు రసనయై రసము లొసఁగు
కర్త! నీదుప్రసాదిఘ్రాణంబునకును నీ
ఘ్రాణంబు ఘ్రాణమై గంధ మొసఁగు
స్పర్శనము లట్ల మఱియు నర్పణముఁ జేసి
పొందు మీఱఁగ సచ్చిదానందరూప
మందు నెలకొని పాదారవిందవినుతుఁ
డసదృశేంద్రియవ్యాప్తియా బసవలింగ! 273

అన్యలింగప్రసాదానుభూతంబు త
త్సంపృష్టరూపప్రసాది చూడ్కి
అన్యలింగప్రసాదానుభూతంబు త
త్సంపృష్టగంధప్రసాది ఘ్రాణ
మన్యలింగప్రసాదానుభూతంబు త
త్సంపృష్టశబ్దప్రసాది వినికి
అన్యలింగప్రసాదానుభావంబు త
త్సంపృష్టభావప్రసాది మనసు
స్పర్శలును రసములుఁ ద్వాక్కు దర్శనాదు
లవి నిరూపంబు లభ్యంతరార్పణములు
గాన తత్తత్సమర్పితాదానభేద
మెసఁగ నెఱుఁగఁ బ్రసాది యా బసవలింగ! 274

అంగీకృతప్రాణలింగాంగకరచర
ణాదినిరూపితభేద మెఱిఁగి
సాంగవల్లింగనానాంగసమర్పిత
ప్రీతి లింగోదకభేద మెఱిగిఁ
శీతలోదకసముచితపునఃపునరర్పి
తాదిప్రసాదవిభేద మెఱిఁగి
ఆత్మసంభవమగ్నహర్షావహామహార్హ
జలసమర్పణసంవిసర్జనముల
భేద మెఱిఁగి తత్ప్రసాదోదకముల
ధర్మమర్మంబు లెల్లను దగ నెఱింగి
కర్మసముదాయమును దాను గడకుఁ ద్రోసి
పెసఁ జరింపఁ బ్రసాది యా బసవలింగ! 275

అర్ఘ్యోదకంబును నర్పితోదకమును
నన్యోన్యక్రియలకు నర్పితములు
మహనీయస్నానసమ్మజ్జనోదకములు
నన్యోన్యక్రియలకు నర్పితములు
హస్తోదకాంఘ్రిసమర్పితోదకములు
నన్యోన్యక్రియలకు నర్పితములు
గండూషపానీయకలితోదకంబులు
నన్యోన్యక్రియలకు నర్పితములు
నవి ప్రసాదంబులో నర్పణావధాన
మర్థి మె ట్లన్న నాభరణాదు లట్ల
గాన యర్పణములచేత గ్రహణభేద
మెసఁగ నెఱుఁగఁ బ్రసాది యౌ బసవలింగ ! 276

సద్గురులింగప్రసాదేష్టలింగప్ర
సాదసంసేవనాశ్రాంతరతులు
జంగమలింగప్రసాదేష్టలింగప్ర
సాదసంసేవనాశ్రాంతరతులు
త్రివిధప్రసాదసాద్వైకవిశ్వాసను
ఖాన్వితకలితవిశ్రాంతరతులు
సకలార్చ్యలింగప్రసాదసేవనములు
గలుగునె పెక్కులింగంబు లనిన
లింగఁ డొక్కండు గాఁడె భక్తాంగకోట్లఁ
దోఁచు నె ట్లన్న నొక్కచంద్రుండు గాఁడె
యంబుకుంభంబులను దోఁచు నట్లు గాన
యెసఁగు బహులింగరూపముల్ బసవలింగ ! 277

షట్త్రింశతత్త్వమై సకలనిష్కళదేహ
మది ప్రసిద్ధంబు గుర్వంగ మగుచు
నాసద్గురువునిష్కళాంగంబు దా లింగ
మది శుద్ధ మగు సకలాంగ మగుచు
నాసద్గురుని సత్కళాతీతునిసుకరం
బదియు మహాప్రసాదాంగ మగుచు
నాసద్గురుని ప్రసాదైక్యసంసేవనా
భావంబు మిగుల సద్భావ మగుచు

నాది గౌరవాచారలింగానుభూతి
నలరుచున్నట్టి సత్ప్రసాదానుకళల
నతిశయం బయి వెలుఁగు మహాప్రసాది
పరమశివుఁ డనఁదగునయ్య బసవలింగ ! 278

ముట్టక ముట్టించు ముట్టి యర్పించు న
ద్యతనకాలోచితద్రవ్యవితతి
ముట్టి యర్పించుచు మును ముట్ట కర్పించు
సంతసం బందఁ బ్రసాదచయము
ముట్టించి ముట్టు దోర్ముఖమున నదియును
ముట్టి సమర్పించి ముట్టఁ బుట్టు
ముట్ట నింద్రియముల ముట్ట కర్పించు నె
ట్లన్నఁ దత్తత్సుఖానంద యగుచుఁ

గాంత కాంతునిఁ బుత్త్రినిఁ గౌఁగిలించు
విధము దోఁచెను భావంబు వేఱె యైన
నట్లు ముట్టియు ముట్టఁడు దృఢప్రసాది
భావశుద్ధి దా నెట్టిదో బసవలింగ ! 279

అన్యతృణోదకాద్యసమర్పితసమేయ
కాయంబు లింగోదకములఁ గడుగు
ద్రవ్యమిశ్రితసికతాద్యసమర్పిత
గతజిహ్వ లింగోదకములఁ గడుగుఁ
దత్తన్ముఖానర్పితాంతనిత్యాకీర్ణ
కర్ణముల్ లింగోదకములఁ గడుగు
నణురేణుధూమ్రముఖ్యాసమర్పితయుతా
క్షరములు లింగోదకములఁ గడుగు

ఘ్రాణమును నట్ల యాకస్మికంబునందుఁ
గడుగును సమర్పితాదిపంకంబు గడుగు
నాప్రసాది లింగస్పర్శ యనుజలముల
మసలక ప్రమోదవశుఁ డౌచు బసవలింగ! 280

అర్పితరూపసమాప్తి యానంతకు
భువి భోక్త వీవయై యవధరింపఁ
దద్ద్రవ్యరససమాప్తం బగునంతకు
ననుభోక్త వీవయై యవధరింపఁ
దద్ద్రుచులును సమాప్తం బగునంతకు
ననుభోక్త వీవయై యవధరింపఁ
దత్సుఖంబులు సమాప్తం బగునంతకు
ననుభోక్త వీవయై యవధరింప

నాప్రసాది జిహ్వాదుల నానసీక
పరిసమాప్తంబు గాఁగ నర్పణము సేయు
నునికికిని మెచ్చి మఱి కథోక్తిని బ్రసాద
మెసఁగ నీలోన నుంచును బసవలింగ! 281

ఆత్మలింగార్పితైకాక్షరోచ్చార
మది యసౌఖ్యంబులకుఁ దుదురు గాన
ప్రాణలింగార్పితాణుమాత్రస్పర్శ
యది జరారుజలకుఁ గుదురు గాన
అంగలింగార్పితాంఘ్రికవిన్యాస
మది పునరావృత్తికుదురు గాన
ఇష్టలింగార్పితేచ్ఛాప్రవర్తన
మద సత్ప్రవర్తనకుదురు గాన
చనుతదీయాన్వితానుసజ్జననకర్మ
ముల కనర్పితద్రవ్యానుభోగరతుఁడు
కాన సర్వార్పితప్రసాదానుభోగి
ప్రాప్తుఁడే తదాపదలకు బసవలింగ ? 282

పాపంగ వలవదే భాండాదిసంగతి
కటమున్నె పూర్వద్రవ్యాశ్రయంబు
లర్పింప వలవదే యవికలేంద్రియముల
నానకమున్నె పదార్థచయము
భోగింప వలవదే పొందంగఁబడు షడ్ర
సములకుమున్నె ప్రసాదసుఖము
తనియంగ వలవదే తనుమనఃప్రాణసం
తృప్తికిమున్నె తదీయభుక్తి
గఱికొనంగ వలదె మఱవక మున్నె మ
హాప్రసాదసత్సుఖాబ్ధిలోన
నట్లు గూడ దేహ మాప్రసాదానుసం
పత్తిఁ గూడ వలదె బసవలింగ ! 283

అవికలేంద్రియభుక్తు లర్పితం బయ్యెఁబో
తనుగుణావళు లర్పితముగ వలదె
తనుగుణావళు లర్పితం బయ్యెఁబో నిజాం
తఃకరణం బర్పితముగ వలదె
తనివి దీఱంగ నంతఃకరణం బర్పి
తం బయ్యెఁబో ప్రసాదరసగర్భ
నిర్భయాత్మకసత్తాంతర్భరితంబు మ
హాప్రసాదంబు దా నర్పితాను
భవము పొందెడివారికి భక్తుఁ డగుచుఁ
ద్రివిధలింగైక్యభావంబుఁ దెలిసి యాత్మ
నిర్వికల్పసమాధిని నెగడుచున్న
వాఁడె ప్రాసాది యగు భువి బసవలింగ ! 284

అనువు మీఱంగ ననుదినవర్ధమానగ
తాస్థినఖరచికురార్పణముగఁ
జర్మకీలాలమాంసస్థూలసూక్ష్మాంగ
దర్పాంగగణశోషణార్పణముగ
సమధాతుజనిత విషమధాతుజనిత ని
జారోగ్యరోగసమర్పణముగఁ
గాలానుగతసహాగమనసంయోగస
మాగమములు వివిధార్పణముగ
నఖిలధనధాన్యవస్త్రవిద్యావిభూష
ణాదిసంపదసేవలు నవ్యయములు
నర్పితము చేసి వర్తించు నాప్రసాది
పరగు సర్వప్రసాదినా బసవలింగ ! 285

భవికృతకూపప్రవాహతటాకాది
  భస్త్రికమండలుభాండవారి
భవిజనారంభసంభవధాన్యనికరత
  దారామకుల్యాలతాంతపాళి
భవిజనస్పర్శనపల్లవకందము
  ఖౌషధప్రముఖపదార్థసమితి
భవిదృష్టిపతనాన్నపానాదిబహుపాక
  తైలప్రభృతిరసద్రవ్యచయము
భవికృతాంబరాదులు మఱి భాండభాజ
నాదులు నిషిద్ధవస్తుచయము లభవస
మర్పణానర్హములు తదీయప్రసాది
కెనఁగునె ప్రసాదసౌఖ్యంబు బసవలింగ ! 286

లోకనిషిద్ధాన్నపాకాదు లెల్ల సం
  స్కారకృతాన్నపాకములసమమె
గాన సంస్కారకృతానర్హములు వాని
  పూర్వాశ్రమం బెట్లు పుచ్చవచ్చు
సంస్కారకృతపాకశాకాదికములు సం
  స్కారితదర్శనస్పర్శనాది
దర్శనస్పర్శనాత్మక మైనవిషయాదు
  లవియెల్ల నిరసన మమరఁ జల్పి
భవివితానక్రియాశుద్ధి పరగఁజేసి
భవివిసర్జనుఁ డైనట్టి భక్తుఁ డెపుడు
సిద్ధలింగసూక్ష్మాచారశుద్ధివలన
భావశుద్ధిని బడయును బసవలింగ ! 287

సమధిగతార్ఘ్యసద్గురుజాతప
విత్రేష్టలింగసుక్షేత్రమంద
కేదారవిధియుఁ బ్రసాది పరీక్షించి
కర మొప్ప నంతటఁ గర్షకుండు
వర్తించురీతిని వల నొప్పఁ గేదార
మందున ఫలితంబు పొందువడఁగ
ఫలములు యుష్మదర్పణ మాచరింపుచుఁ
బ్రతిముహూర్తము క్రొత్తపంట యైనఁ
దత్స్వయంకృషి ప్రాప్తతత్ప్రసాద
ఫలనిరంతరభోగసంప్రాప్తుఁ డగుచు
నన్యకృషిఫలాదులు ముట్టఁ డాప్రసాది
వెసఁ గళాప్రౌఢి యెట్టిదో బసవలింగ ! 288

చరియించు తద్వ్రతాచారప్రవర్తన
లర్పించు నీమనంబంద యుండి
ముట్టు నానాకందమూలాన్నపానాదు
లర్పించు నీకరంబంద యణఁగి
పొందు నానావస్త్రభూషణమాల్యాదు
లర్పించు నీయాత్మయందె యణఁగి
పాయు నానాకర్మబాష్పకణాదులు
నర్పించు నీబుద్ధియంద నిలిపి
యట్ల స్వప్నావగతభవదప్రసన్న
సుఖము లర్పించుచును హుతముఖునిఁ జేసి
యాప్రసాదియుఁ దత్ప్రసాదాంచితాను
భవసుఖం బందు నీయందు బసవలింగ ! 289

విహితావిహితములౌ విధినిషేధక్రియ
లవి రెండు నీకు సమర్పణముగ
నందు సముద్భవం బగు పుణ్యపాపంబు
లవి రెండు నీకు సమర్పణముగ
నందు సంభూతంబు లగు శుభాశుభచేష్ట
లవి రెండు నీకు సమర్పణముగ
నందు సంజనితంబు లగు సుఖదుఃఖంబు
లవి రెండు నీకు సమర్పణముగఁ
దత్పరంపరాజనితకృత్యముల మీఁఱు
భుక్తియుక్తులు రెండు సంసక్తముగను
జనఁ దదీయఫలానపేక్షప్రసాది
కెనఁగు సిద్ధప్రసాదంబు బసవలింగ ! 290

హానివృద్ధులును జయాపజయంబులు
నాదియౌ క్రియలు నీ కర్పణముగ
నాపదసంపదల్ హర్షాదు లిటులు లో
పాలోపములును నీ కర్పణముగ
నిందాస్తుతులు కర్మనిష్కర్మములును గా
ర్యాకార్యములును సమర్పణముగ
మానావమానముల్ హీనాధికంబులు
నవియెల్ల నీకు సమర్పణముగఁ
గామనాకామములును రాగములు ద్వేష
ములును గ్రియ లెల్లఁ దత్తత్ప్రముఖ్యదశలు
నర్పణము గాఁగ నున్నన్న యాప్రసాది
కెనఁగునే భవబంధముల్ బసవలింగ ! 291

ఘనతరం బైనట్టి గంధవస్త్రాభర
    ణాదులు నీకు సమర్పణముగ
చూపులు రూపులు శ్రుతులును మఱియుఁ బా
    యనిరీతి నీకు సమర్పణముగ
వాసనలును శ్వాసవర్గంబు లవియు ధ
    ర్మాధర్మములును నీ కర్పణముగ
రసములు రసనాగ్రరసములుఁ బాటలు
    నాటలుఁ జదువులు నర్పణముగ
  వీను లాలించుటలుగూడ వివిధవిషయ
  సుఖము లర్పించి కైకొను సుప్రసాది
  పంచభూతాదికృత్యముల్ బహువిధములఁ
  బరిణమించంగఁ దా నేర్చు బసవలింగ! 292

తలఁ పనర్పితవిధిఁ దారునే భవదంఘ్రి
    శతపత్రకీర్ణ కౌశలమువలనఁ
బలు కనర్పితవిధిఁ జిలుకునే భవదభి
    ధానామృతరసపాత్రంబువలన
భావం బనర్పితపద్ధతిఁ బొలయునే
    త్వద్భావమదనోత్సవమున మునిఁగి
ప్రాణం బనర్పితపథమునఁ జనునె త్వ
    త్ప్రాణలింగైక్యసంపదలఁ బొదలి
  తన్నుఁ జూపునె యసమర్పితములఁ బొదలు
  తావకాగతప్రాణమధ్యమున నణఁగి
  యింద్రియంబుల నర్పింప నిచ్చనేయఁ
  బొల్పడునె త్వత్ప్రసాదియు బసవలింగ! 293

మదనవికారంబు మనెఁ బుట్టునప్పటి
తలఁపు లర్పించెడికొలది యెఱిఁగి
రమణి యావేళను రతి పుట్టి యాడెడు
మాటల నేర్పరివాట మెఱిఁగి
యంగసంగతిఁ జుంబనాలింగనాదుల
తీపు లర్పించెడి తెలివి యెఱిఁగి
తమకించు పొందు చేఁ దన్నెఱుంగనియట్టి
సుఖము లర్పించెడిసూక్ష్మ మెఱిఁగి
పరగ నంతరంగ బహిరంగముల యాత్మ
విషయగతులసహిత వివర మెఱిఁగి
యర్పణంబు సేయు నతఁడు ప్రసాదాంగి
పటుదయాంతరంగ ! బసవలింగ ! 294

శాకమిశ్రమము విస్తారంబు నర్పించు
పాకమిశ్రక్రియాప్రకృతియట్ల
పాకమిశ్రము పొందుపడఁగ నర్పించును
రసమిశ్ర మర్పించు రమణ యట్లు
రసమిశ్ర మవధానరతి రస మర్పించు
రుచిమిశ్ర మైనట్టి రూప మట్లు
రుచిమిశ్ర మాత్మానురూప మర్పించును
వివిధమిశ్రార్పణవిహిత మట్లు
విషయమిశ్ర మాత్మవిభుఁ జొచ్చి యిచ్చుఁబో
తత్ప్రసాదము నవధాన మమర
వెలయ మిశ్రమైన వివిధాన్నరసములు
పరిగ్రహించు టెట్లు బసవలింగ ! 205

రాదు పూర్వం బన రాదు పూర్వము వచ్చు
నగుద్రవ్యతత్పూర్వ మణఁగు టెట్లు
ముట్టియు నిడరాదు ముట్టక యీరాదు
ముట్టక ముట్టించు ముట్టు టెట్లు
రుచు లెఱుఁగఁగరాదు రుచు లెఱుంగుట గాదు
రుచు లర్పణము సేయ రూప మెట్లు
సోఁకరా దర్పించి సోఁకరా దొల్లక
గంధదుర్గంధసంబంధ మెట్లు
లిచ్చికొనఁగరాని యీరాని వాహనా
సనవిధార్పణములచంద మెట్లు
మిగులఁ బొందఁగలుగుఁ దగవస్త్రభూషణ
భావ మెట్లు కలుగు బసవలింగ! 296

త్రాసునందున మఱి చేసి లేకయ యొక్క-
చందమై తూకంబు పొందినట్లు
యుక్తంబుగా నుంచి యొకదిక్కు నేయంగ
నున్నదిక్కున నేత యొనరునట్లు
సరి ధనుర్ధరుఁడు లక్ష్యం బేయ బాణంబు
తోడ్తో నరేంద్రుండు దోఁచునట్లు
పిలుచుచు నిద్రించఁ బేర్కొన్ననైన య
క్షరములతోన మేల్కాంచినట్టు
లసమశబ్దాదివిషయసుఖానుభూతి
శ్రోత్రముఖ్యేంద్రియంబులు సోఁకునప్పు
డతిశయంబుగఁ దత్ప్రసాదానుభవము
భవ్య మగురీతిఁ దా నెట్లు బసవలింగ! 297

జగమునఁ గొందఱు శైవుల మంచును
బల్కుచుందురు మఱి పాటిగాను
వివరంబుగా సప్తవిధశైవభేదంబు
లెఱుఁగనేరరు గురుతరముగాను
వృత్తి శైవం బగు బత్తి వైష్ణవ మగుఁ
త్రికరణశుద్ధి లే దెంచిచూడఁ
గీర్తింపఁగా శివగీతలు చదువరు
తగ భగవద్గీత లగణితం బ
టంచుఁ బల్కుచు నుందురు పంచముఖుఁడు
ఘనతమీఱిన భగవంతుఁ డనెడుబుద్ధి
దోఁప దేమందు వైష్ణవతుల్యు బవనిఁ
బరశివప్రసాదు లెట్లౌకో బసవలింగ ! 298

ఆకసమునఁ గడు జోకను జను దెంచు
వైనతేయునిఁ జూచి మానుగాను
ద్వారకాపురివాస ! కారుణ్యసాగర !
ధీయుతపోష ! కృష్ణా ! యటంచుఁ
బొగడుదు రతిముఱి జగదుపకారి యా
వృషభేశుస్మరణ గావింప రెపుడు
మోదంబు మీఱఁ బ్రహ్లాద విభీషణ
యనుచు స్మరించెద రనుదినంబు
నీదుభక్తులఁ జూడరు నీస్వరూప
మిట్టి దన్నను మఱి చెవిఁ బెట్ట రహహా !
యట్టివారిని భువి శైవు లను టదెట్లు
వసుధ వారు ప్రసాదులే బసవలింగ ! 299

దహనకార్యము ధర ధర్మం బటండురు
ఖననంబు ధర్మంబు గా దటండ్రు
ఏభూత మాదియౌ నీభూమి స్థూలశ
రీరాదులకును మాతృకయు నెద్ది
యట్టిభూతంబున గుట్టుగా దాఁగుట
కన్నను దహనంబు మిన్న యగునె
శంకరుం డన నొప్పు షణ్మతోద్ధారకుం
డును సమాధియ ధర్మ మనెను గాదె
పూని యెన్నఁడు మఱి ముట్టరానివారు
దాఁకి కాల్పఁగ శల్యముల్ దాఁచి నీటఁ
గలుపువారలు మేము శైవుల మటంచుఁ
బల్కువారు ప్రసాదులే బసవలింగ! 300

భవదీక్షణాంచల ప్రస్రుతనియతఘృ
ణారసపూరవిహారరతులు
భవదీయగురుపాదపద్మరజస్సము
ద్భూతానుభావవిఖ్యాతినుతులు
భవదంఘ్రిసరసిజప్రస్తుతపాంసున
ముత్తంససీమానుమోదయుతులు
భవదనుభూతివిస్ఫారసుఖామృత
రుచిరసర్వేంద్రియారూఢమతులు
సేయు నీస్తవంబు చెవులార వినువారి
వ్రాయువారిఁ జదువువారి విస్త
రించువారి నతిసమంచితముగఁ బ్రోవు
పటుదయాంతరంగ! బసవలింగ! 301

ఇది శ్రీమ ద్బసవేశ్వరప్రసాదలబ్ధ కవితాధురీణ భృంగిరిటి గోత్ర శ్రీమ త్పాల్కురికి సోమనాథప్రణీతం బగు చతుర్వేదసారము.

---

# సోమనాథునిగూర్చిన కొన్ని ప్రాస్తావికస్తుతులు

శ్లో. ఆదౌ భృంగిరిటిః, పురాకృతయుగే నామ్నాసుకేశీప్రభుః।
త్రేతాయాం వరవీరశైవశరణ శ్రేష్ఠోమునిః పాణినిః।
ద్వాపారే శివమంత్రసిద్ధికలిత స్సానందనామాంకితః ।
ఏవం భక్తహితార్థతః కలియుగే పాల్కురికి సోమేశ్వరః॥

(అనుశ్రుతము)

ఉ. శ్రీభసితత్రిపుండ్రకపరీతవిశంకటఫాలు, జాటజూ
టీభరధారు, నిర్మలపటీపటలావృతదేహు, నక్షమా
లాభరణాభిరాము, బసవాంకురపారపవిత్రవక్త్రుఁ, జి
చ్ఛోభితచిత్తుఁ బాల్కురికి సోమయదేశికుఁ బ్రస్తుతించెదన్.

(పిడుపర్తి సోమనాథుఁడు)

మ. వరసర్వజ్ఞశిఖామణిన్, ప్రథితసద్వారప్రమోదాకరున్
నిరతోద్యచ్ఛివధర్మసంచరుఁ, గళానీకాంచితావాసు, భా
స్వరలింగాన్వితదేహు, సర్వవిబుధవ్రాతామృతాధారు, భా
సురపాదుంగళితారిఁ బాల్కురికివంశ్యుంగొల్తుసోమాహ్వయున్.

(అత్తలూరి పాపయామాత్యుఁడు)

ఉ. తేనియసోనలం జిలుకు తేటగు జాను తెనుంగుఁ బల్కులన్
వీనులఁ దన్పు కబ్బముల నిక్కపు దేసి తెనుంగుఁ గైతకున్
బ్రాణము వోసినట్టి బుధవంద్యుని, శ్రీబసవేశచింతనా
సూనృతచిత్తుఁ బాల్కురికి సోమకవీంద్రుని సంస్మరించెదన్.

(బండారు తమ్మయ్య)

# శుద్ధపత్రిక



| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 5 | 8 | 11 | నామంచిది | నామంబిది |
| 7 | 12 | 1 | యన్తు | యస్తు |
| 8 | 15 | 3 & 4 | దుస్వప్న | దుస్స్వప్న |
| .7 | 32 | 11 | సురల | సురుల |
| .8 | 34 | 11 | ,, | ,, |
| 22 | 42 | 10 | ,, | ,, |
| 23 | 45 | 11 | ,, | ,, |
| , | ,, | 9 | యాశీత్త | యాసీత్త |
| 4 | 46 | 5 | బూాజం | బూాజ్యం |
| 34 | 67 | 8 | శివస్వాయ | శివస్స్వాయ |
| 41 | 81 | 10 | సురలు | సురులు |
| 42 | 83 | 6 | గోళ్వారె | గోల్వారె |
| , | ,, | 9 | యిట్లు | యిట్టు |
| 43 | 84 | 9 | ,, | ,, |
| , | 85 | 9 | ,, | ,, |
| 45 | 88 | 7 | దైవమై | దైవమేఁ |
| , | ,, | 8 | కర్మముల | కర్మములు |
| 50 | 98 | 3 | నట్ధు | నట్టు |
| ,, | ,, | 12 | సురల | సురుల |
| ,, | 79 | 12 | ,, | ,, |
| 51 | 101 | 10 | గలికి | గల్కి |
| 56 | 111 | 8 | బెట్ట | బెట్టఁ |
| ,, | ,, | 9 | సురల | సురుల |
| 58 | 115 | 11 | ,, | ,, |
| 62 | 123 | 1 | స్పర్శ | స్స్పర్శ |
| ,, | ,, | 4 | ధాయ | ధ్యాయ |
| 64 | 126 | 2 | నచ్ఛెక | నచ్ఛైక |

| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 64 | 126 | 12 | దేవతుల్ | దేవతల్ |
| ,, | 127 | 8 | దుడంచి | దుడిచి |
| 65 | 128 | 11 | యుక్తి | వృత్తి |
| 71 | 141 | 1 | కడంగంట | కడగంట |
| 72 | 142 | 4 | మరి | మఱి |
| 74 | 147 | 7 | సీమావి | సీమాఽవి |
| 85 | 169 | 1 | మార్గ | మూర్గ |
| 86 | 170 | 2 | మడసె | మడిసె |
| 88 | 176 | 8 | జీఱి | జీరి |
| 97 | 192 | 10 | మలంగు | మలుంగు |
| 108 | 214 | 2 | స్వాద | స్వేద |
| 113 | 225 | 4 | ద్వైక | ద్వైక |
| 127 | 253 | 9 | నెవ్వండైన | నెవ్వండైన |
| 150 | 298 | 11 | బవని | లవని |
| ,, | 299 | 11 | బనుట | లనుట |
| 152 | 2 | 2 | నిర్మబ | నిర్మల |

